*Hazrath Muhammad (SAS) Sab ke liye*
*(Telugu)*

# హజ్రత్ ముహమ్మద్

సల్లల్లాహు అలైహి వ సల్లం

# అందరికోసం


రచన

**ముహమ్మద్ రఫిఉద్దీన్ ఫారూఖి**

అనువాదం

**ముహమ్మద్ అబ్దుర్రషీద్**

# విషయ సూచిక

అపార కృపాశీలుడు పరమ కరుణామయుడయిన అల్లాహ్ పేరుతో

# తొలి పలుకులు

నహ్మదుహూ వనుసల్లి అలా రసూలిహిల్ కరీమ్. చరిత్రలో మానవుడికి హితోపదేశం రెండు విధాలుగా లభించింది. ఒకటి, అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథం ద్వారా, రెండు ప్రవక్తల జీవిత చరిత్ర ద్వారా. రెండింటికి అవినాభావ సంబంధం ఉంది. రెండింటిలో ఏదోఒక దానిని మాత్రమే అనుసరించి నట్లయితే దైవ ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకోవడం కష్టమయిపోతుంది. అలా చేసినవారు మార్గ భ్రష్టులయి విభిన్న మతాలుగా విడిపోయారు. అల్లాహ్ మాత్రం ఒకే విధేయతా మార్గం పంపించాడు. హితోపదేశం కోసం దివ్య ఖుర్ఆన్ అవతరణ, ప్రవక్త (స)లను ప్రభవింప జేయడం జరిగింది. ఆ పరంపరలోని ప్రవక్తలలో ముహమ్మద్ (స) చివరివారు, గ్రంథమూ చివరి గ్రంథమే. ప్రళయదినం వరకు ఇవి మానవులందరికోసం మార్గదర్శకం. ఆ దైవ హితోపదేశంపై ఎవరికీ ఆధిపత్యం లేదు. ముస్లింలు ఆ హితోప దేశానికి అమానతుదారులు మాత్రమే.

ఈ భావనతో జమాఅతె ఇస్లామీ హింద్(జంటనగరాల) ఆధ్వర్యాన ఏప్రిల్ 2005లో "హజ్రత్ ముహమ్మద్ (స) అందరి కోసం" అంశంపై ఉద్యమం నడిచింది. ఆ సందర్భంగా ముస్లిం - ముస్లిమేతర సమ్మేళనలు జరిగాయి. కొన్ని సమావేశాలలో ప్రసగించే అవకాశం, నాకు లభించింది. ముస్లిమేతర సోదరులలో ఇస్లాం గురించి తెలుసుకునే ఉత్సాహం అధికంగా కానవచ్చింది. ఏ విషయాలనయితే నేను ఆ సమావేశాలలో ప్రసంగించానో వాటిని వివరంగా రిఫరెన్స్‌లతోపాటు రచించాను. ఈ చిరుపుస్తకం ద్వారా ముస్లిం, ముస్లిమేతరు లలో హజ్రత్ ముహమ్మద్ (స) జీవితం ఇంకా ఇస్లాం పరిచయం అవుతుంది. ఆయన (స) జీవిత చరిత్రను సంక్షిప్తంగాను, సులభగ్రాహ్యంగాను వివరించడా నికి ప్రయత్నించాను. అల్లాహ్ ఈ ప్రయత్నాన్ని స్వీకరించుగాక! ఆమీన్.

**ముహమ్మద్ రఫీఉద్దీన్ ఫారూఖీ**

(27రమజాన్, 1426హిజ్రి, 1 నవంబర్, 2005)

# హజ్రత్ ముహమ్మద్ (సల్లం) అందరికోసం

కొంత మంది ముస్లింల ప్రవర్తన, మరికొంతమంది ముస్లిమేతరుల దుష్ప్రచారం వల్ల హజ్రత్ ముహమ్మద్ (స) ఇస్లాం వ్యవస్థాపకులని, ముస్లింలు ఒక జాతి అని, దివ్యఖుర్ఆన్ ముస్లిములు మత గ్రంథం అనే అపార్థాలు, అపోహలు ప్రబలిపోయాయి. ఈ అపార్థాలు, అపోహలు ముస్లిం, ముస్లిమే తరుల మధ్య ఒక అడ్డుగోడగా నిలిచాయి. ఆ గోడను కూల్చనంతవరకు ఈ అపార్థాలు, అపోహలు దూరం కాజాలవు. నిజానికి హజ్రత్ ముహమ్మద్ (స)[1] ఇస్లాం వ్యవస్థాపకులు కాదు. ఇస్లామ్‌ను స్థాపించే ప్రవక్తలలో ఆయన చివరివారు. హజ్రత్ ముహమ్మద్ (స) ఏ ఇస్లాం ధర్మాన్నైతే ప్రచారం చేశారో, దానిని అంతకు ముందు హజ్రత్ ఆదం (అలై)[2], హజ్రత్ నూహ్ (అలై), హజ్రత్ ఇబ్రాహీం (అలై), హజ్రత్ మూసా (అలై), హజ్రత్ ఈసా (అలై), విభిన్న దేశాలలో, విభిన్న భాషలలో ప్రచారం చేశారు. ఆ విధంగా ఉన్నది కేవలం ఒకే ధర్మం అని ఇస్లాం ప్రతిపాదిస్తుంది. దివ్యఖుర్ఆన్, చివరి దైవ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (స) ప్రపంచవాసుల సమిష్టి సంపద. ఏ విధంగా నయితే గాలి, సూర్యుని వెలుతురు ప్రపంచవాసులందరికోసం ఉన్నాయో, వాటిపై ఎవరికీ ఆధిపత్యంలేదో అలాగే అల్లాహ్ అందరిని పరిపోషించేవాడు, హజ్రత్ ముహమ్మద్(స) ప్రపంచవాసులందరికోసం కారుణ్యం.

*(దివ్యఖుర్ఆన్ : ఆలి ఇమ్రాన్ :19,67, నుండి 85, అల్ బఖర:131 నుండి 133, యూనుస్ : 84, అల్ మాయిద:111, అల్ అహ్ఖాఫ్ :9, అల్ ఫాతిహా : 1, అల్ అంబియా : 107)*

## దైవదౌత్యం చరిత్ర

మానవ చరిత్ర ఎంత ప్రాచీనమయినదో ప్రవక్తల చరిత్ర అంతే ప్రాచీన మయినది. హజ్రత్ ఆదం (అలై) నుండి కూడా: "మా హితోపదేశం ప్రవక్తల

1. *'స' అంటే సల్లల్లాహు అలైహివసల్లం అంటే ఆయనపై శాంతికురియుగాక! అని అర్థం.*
2. *(అలై) అంటే అలైహిస్సలాం అంటే ఆయనపై శాంతి కురియుగాక అని అర్థం*

ద్వారా, గ్రంథాలద్వారా మీ వద్దకు వస్తూ ఉంటుంది. ఎవరయినా సరే దానిని అనుసరించినట్లయితే వారికి ఎప్పుడూ ఏ విధమయిన విచారం కలుగదు." అని అల్లాహ్ ప్రారంభంలోనే తెలియజేశాడు.(అల్ బఖర:38) ఈ హితోపదేశాన్ని హజ్రత్ ఆదం (అలై) తన సంతానానికి, ఆ సంతానం వారి సంతానానికి తెలియజేసింది. జనాభా పెరుగుతూ పోయినకొద్దీ వారు తెగలుగా, జాతులుగా విస్తరిస్తూపోయారు. అలా అల్లాహ్ కూడా ఆయా జాతులలో, తెగలలో, ప్రవక్తలను పంపిస్తూపోయాడు.(అర్రాద్:7; ఫాతిర్: 24) ఈ పరంపర వేలాది సంవత్సరాలుగా కొనసాగుతూపోయింది. భాష, ప్రాంతం, కాలం, దూరం ఎంతయినా, ఏదయినాసరే ప్రవక్తలందరి సందేశం ఒక్కటే. ఆ సందేశం:

**"యాఖౌమిఅ్‌బుదుల్లాహి మాలకుమ్ మిన్ ఇలాహి గైరుహు"**

"ఓ నా జాతి ప్రజలారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మరో దేవుడులేడు. (ఆరాఫ్:59,65, 73,85) (అల్లాహ్ ఆరాధన పేరే ఇస్లాం) ఈ సందేశాన్ని చాలా తక్కువ మందే విశ్వసించారు. ఇంకా చాలా మంది దానిని వ్యతిరేకించారు. అలా వ్యతిరేకించిన వారిపై విభిన్న రకాల శిక్షలుపడి సర్వనాశనమయిపోయారు. ఆద్ జాతి, సమూద్ జాతి, లూత్ జాతులకు చెందిన నగరాలు, వాడలు నాశనమైపోయి గుర్తులుగా మిగిలాయి. వేలాది సంవత్సరాలుగా కొనసాగిన ప్రవక్తల గాథలను అల్లాహ్ సంక్షిప్తంగా ఇలా చెప్పాడు.

"మేము ప్రతి జాతిలోనూ ఒక ప్రవక్తను ప్రభవింపజేశాము. అతని ద్వారా అందరికీ ఇలా హెచ్చరిక చేశాము: 'అల్లాహ్‌ను ఆరాధించండి, మిథ్యా దైవాల ఆరాధనకు దూరంగా ఉండండి.' ఆ తరువాత వారిలో కొందరికి సన్మార్గాన్ని ప్రసాదించాడు. మరి కొందరిని అపమార్గం లోగొన్నది. కొంచెం భువిలో సంచారం చేసి చూడండి, తిరస్కారులకు ఏ గతి పట్టిందో."

## ప్రవక్తల భూమిక

ప్రవక్తలందరూ మానవులే. వారికీ భార్యాపిల్లలు ఉండేవారు. బజారుల్లో మామూలుగా తిరిగేవారు. అన్నపానీయాలు సేవించేవారు. వారికి అగోచర

విషయాలు తెలిసేవికావు[3]. లాభనష్టాల అధికారం వారికి లేకుండింది. అద్భు తాలు చూపించడం వారి అదీనంలో లేదు. వారు ఎవరినీ సన్మార్గంపై నడిపంచ లేరు[4]. అల్లాహ్ ఎవరికి సన్మార్గం చూపుతాడో వారి కోసం ఆదేశాలు అవత రింపజేశాడు. వారు ప్రజలకు అల్లాహ్ ఆదేశాలను వివరించేవారు. ప్రజలు అల్లాహ్‌ను విశ్వసించిన తరువాత ప్రవక్తలను విశ్వసించాలి. వారికి విధేయత చూపాలి.

*(దివ్యఖుర్ఆన్ : అల్ ముమినూన్ : 33-34, అల్ ఫుర్ఖాన్ :7,20, అల్ అన్ఆమ్ : 50, అల్ ఆరాఫ్ :188, అల్ ఖసస్ : 56, బనీఇస్రాయీల్ :93, అన్నిసా : 64,80 అన్ నహ్ల్ :44)*

## ప్రవక్తల పట్ల వారి జాతుల ప్రవర్తన

- ప్రవక్తలను అనుసరించిన సమాజాలు వారిపట్ల అతి చెడుగా ప్రవర్తిం చాయి. ఆ ప్రజలు వారిని ఒక వైపు ఎగతాళి చేస్తూ, వారిని తిరస్కరించేవారు. వారిని మంత్రగాడని, పిచ్చివాడని అంటూ మరోవైపు అగోచరం తెలిసినవాడని, అద్భుతాలు చూపించాలని కూడా కోరేవారు. వారిని హింసించి వారిని వారి జన్మస్థలం నుండి వెళ్ళగొట్టేవారు. చివరికి వారిని హత్యచేయడానికి కూడా వెనుకాడలేదు.

  *(జుఖ్రుఫ్ : 7; అల్ అంబియా : 41, బనీఇస్రాయీల్ : 90-95, అల్ హాఖహ్ : 41-42, సాద్ : 4, మరియం : 46, అల్ బఖర: 61)*

- ప్రవక్తలు మరణించిన తరువాత కూడా వారిపై దౌర్జన్యం చేశారు. ఒకడయితే వారి వ్యక్తిత్వాన్ని అతిగా చేసి వారికి దైవ గుణగణాలను అంటగట్టాడు. ఒకరిని దేవుని అవతారమని, మరొకరిని దేవుని కుమారుడని, ఇంకొకరిని దేవునిగా భావించి అతనికి దేవుని గుణం అంటగట్టాడు. *(అన్ నిసా : 171, అత్తౌబ : 30)*

---

3. *అల్లాహ్ తెలియచేస్తేనే ప్రవక్తలకు అగోచర విషయాలు తెలుస్తాయి.*
4. *అంటే ఎవరు వక్రమార్గంలో నే నడవదలిచారో వారిని బలవంతంగా సన్మార్గంపై ఎవరూ నడిపించలేరు. అల్లాహ్ కూడా అతనికి సన్మార్గం చూపదు.*

- ఆ ప్రవక్తలు తీసుకువచ్చిన గ్రంథాలను కూడా మార్చివేశారు. ప్రజలలో మూఢనమ్మకాలు జనింపజేసి పనికిమాలిన మాటలలో పడవేసి తమ చరిత్ర, తమ వేదాంతాలు, తమ తీర్పులు, ధర్మ–అధర్మ సంపాదనల విధానాలు, కట్టు కథలను చేర్చి ఆ గ్రంథాలలో హెచ్చుతగ్గులు చేసేవారు. ఆ విధంగా వారు దైవ హితోపదేశాన్ని పోగొట్టుకున్నారు. అలా దేవుని నిజధర్మాన్ని వదిలేసిన కారణంగా అనేక మతాలు ఏర్పడ్డాయి. స్వయంగా వారు మార్గం తప్పడమే గాక భావి తరాలను కూడా మార్గభ్రష్టతకు కారణమయ్యారు. *(అల్ బఖర : 75, ఇంకా ప్రసుత్త బైబిల్ చరిత్రను చూడండి)*
- మనం కాస్త పరిశీలించినట్లయితే గతించిన ప్రవక్తల గ్రంథాలుగాని, వారి జీవిత చరిత్రలుగాని, సురక్షితంగా లేకుండాపోయాయి. వారి గాథలు మన దాకా ఏవైతే చేరాయో వాటిలో వైరుధ్యం కలిగి నిరాధారంగా మిగిలిపోయాయి. ఈవిధంగా వారి బోధనలు, వేలాది సంవత్సరాల వారి చరిత్ర చీకట్లలో కలిసిపోయింది. అల్లాహ్ తరఫునుండి ప్రపంచంలోని విభిన్న జాతులలో ఆయా కాలాల్లో మానవుల మార్గదర్శకం కోసం పంపబడిన గ్రంథాలను, ప్రవక్తలను ఎలాంటి విభేదం చూపకుండా ముస్లిము లందరూ విశ్వసిస్తారు. కాని వారిని అనుసరించరు. అయితే ఇది పక్షపాతం కాదు. వారి బోధనలు, వారి జీవిత చరిత్రలు సురక్షితంగా లేకపోవడం వల్లనే. అయితే అల్లాహ్ అనుగ్రహం కోసం, సన్మార్గం కోసం తప్పకుండా వారంతా దివ్యఖుర్ఆన్ వైపు, హజ్రత్ ముహమ్మద్ (స) వైపునకే మరలవలసి ఉంటుంది. ఎందుకంటే దైవ ప్రవక్తపై అవతరింపజేసిన గ్రంథం ఖుర్ఆన్ సురక్షితంగా ఉంది. ఆయన (స) జీవిత చరిత్ర కూడా పూర్తిగా సురక్షితంగా ఉంది.

*(అల్‌బఖర : 136,285, ఆలిఇమ్రాన్ : 85, అల్‌హిజ్ర్ : 9, అల్‌ఖియామహ్ : 19)*

# హజ్రత్ ముహమ్మద్ సల్లం ప్రత్యేకతలు

ప్రవక్తలందరిలో ప్రామాణికమయిన, తృప్తికరమయిన హితోపదేశం మనకు హజ్రత్ ముహమ్మద్ (స) గారి ద్వారానే లభిస్తుంది. దీనికి కారణాలు క్రింద విశదీకరిస్తున్నాము.

## 1. హజ్రత్ ముహమ్మద్ (స) అంతిమ ప్రవక్త

ప్రవక్తల పరంపర హజ్రత్ ముహమ్మద్(స)తో సమాప్తమయింది. ఇక ఆయన (స) తరువాత మరొక ప్రవక్త వచ్చే అవకాశం లేదు. అందుకే ఆయనను చిట్టచివరి ప్రవక్త 'ఖాతమన్నబియ్యీన్' అని చెప్పబడింది.

*(అల్ అహ్జాబ్ : 40)*

ఆయన (స) తన గురించి ఒక ఉదాహరణ ద్వారా ఇలా వివరించారు. "ఒక వ్యక్తి ఒక భవనం నిర్మించాడు, కాని అందులో ఒక ఇటుక స్థలం విడిచిపెట్టాడు. ప్రజలు దాని చుట్టూ తిరిగి చూశారు. ఈ స్థలాన్ని పూడ్చి వేస్తే బాగుండేది అనేవారు. ఆ ఇటుకను నేను. (బుఖారి–ముస్లిం) ఆయన(స) ఇంకా ఇలా కూడా అన్నారు: 'లానబియ్యబఅది' నా తరువాత మరొక ప్రవక్త ఎవరూ రారు.' ఈ విషయాన్ని పద్నాలుగు వందల సంవత్సరాల చరిత్ర కూడా ధృవీకరిస్తోంది. హజ్రత్ ముహమ్మద్ (స) తరువాత ఇప్పటివరకు తనపై ఆకాశవాణి ద్వారా గ్రంథం అవతరించి, దాని ద్వారా ప్రపంచంలో ఒక విప్లవం చెలరేగిందని చెప్పిన వ్యక్తి ఇంతవరకు ఎవరూ రాలేదు.[5] ఈ ఔన్నత్యం కేవలం హజ్రత్ ముహమ్మద్ (స)కే దక్కింది.

---

5. *అయితే మహనీయ ముహమ్మద్ (స) కాలంలో ముసైలమ అనేవాడు అబద్ధ ప్రవక్తగా ప్రకటన చేశాడు. 20వ శతాబ్దంలో భారత దేశంలోని, పంజాబ్‌లో ఖాదియాన్ అనే ప్రాంతం నుండి ఆంగ్లేయుల బంటు మిర్జాగులాం అహ్మద్ ఖాదియానీ అనేవాడు కూడా అబద్ధ ప్రవక్తగా దావా చేశాడు. అతడు అబద్ధీకుడని ముస్లిం పండితులు నిరూపించారు కూడా. ఇలా అబద్ధ ప్రవక్తలు పుట్టుకు వస్తారని మహనీయ సల్లం భవిష్యవాణి చెప్పే ఉన్నారు.*

## 2. ఇస్లాంలో చివరి షరీఅత్ ముహమ్మద్ ప్రవక్త(స)దే

మహానీయ (స) అంతిమ ప్రవక్త. ఆయన (స)కు ఏ ధర్మం అయితే ప్రసాదించబడిందో అది సంపూర్ణ దైవిక చట్టాలతో వచ్చిన చివరి గ్రంథం. ఇప్పటివరకు ప్రవక్తలకు ఇస్తూ వచ్చిన ధర్మశాస్త్రాలు (షరీఅత్)లు అప్పటి అవసరాలకు, పరిస్థితులకు తగిన విధంగా ఉండేవి. వాటిలో హెచ్చుతగ్గులు జరుగుతూ వచ్చాయి. ఇప్పుడు హజ్రత్ ముహమ్మద్ (స)కు ఇవ్వబడిన షరీఅత్ సంపూర్ణమయినది. అందులో ఎలాంటి సంస్కరణలు, మార్పులు చేర్పులు అవసరం లేదు. దేనినయితే అది ధర్మసమ్మతంగా చేసిందో అది ప్రళయం వరకు ధర్మసమ్మతమే. దేనినయితే అది అధర్మమని నిర్దేశించిందో అది ప్రళయం వరకు అధర్మమే అవుతుంది. ఇక ఎవరి సలహా సంప్రదింపులు, సామూహిక తీర్మానాలు దానిని మార్చలేవు. వ్యక్తిగత జీవితానికి గాని, సామూహిక జీవితానికిగాని అది శాసించనిదంటూ ఏదీ లేదు. ఇస్లాం ధర్మంలో ఉన్న పరిపూర్ణత, యోగ్యతలు ప్రతీ కాలంలోనూ ఆచరించదగినవి. మహానీయ (స) గారికి అంతిమ హజ్ సందర్భంలో అల్లాహ్ ఇలా చెప్పాడు:

> **"అల్‌యౌమఅక్‌మల్‌తు లకుమ్ దీనకుమ్ వఅత్‌మమ్‌తు అలైకుమ్ నిఅ్‌మతి వరజీతు లకుముల్ ఇస్లామ దీనా"**
>
> "ఈనాడు నేను మీ ధర్మాన్ని మీ కోసం పరిపూర్ణం చేశాను. నేను నా వరాన్ని మీపై పూర్తి చేశాను" (అల్ మాయిద :3)

## 3. హజ్రత్ ముహమ్మద్ (స) సందేశం విశ్వవ్యాప్తమైనది

అంతకు ముందు ఎంతమంది దైవ ప్రవక్తలుగా వచ్చారో వారి సందేశం కేవలం వారి వారి జాతులవరకే పరిమితమయ్యింది. కాని ఇప్పుడు హజ్రత్ ముహమ్మద్ (స) గారి సందేశం ప్రపంచవాసులందరి కోసం వచ్చింది. వారి వంశం, రంగు, భాష, ప్రాంతం ఏదైనాసరే. వారు ఏ దేశానికి, ఏ జాతికి చెందిన వారయినా సరే. ఎలాంటి వివక్ష చూపకుండా 'యా బనీఆదమా' "ఓ ఆదం సంతానమా!, 'యా అయ్యుహన్నాస్' ఓ మానవులారా! అని సంబోధిస్తుంది ఖుర్ఆన్. ఇంకా ఇలా కూడా ప్రకటిస్తోంది:

'ఖుల్‌యాఅయ్యుహన్నాసు ఇన్నీ రసూలుల్లాహి ఇలైకుమ్ జమి'

"ఓ ముహమ్మద్ ఇలా ప్రకటించు: మానవులారా! నేను మీ అందరి వైపునకు వచ్చిన అల్లాహ్ సందేశహరుణ్ణి" (ఆరాఫ్ : 158) మరొక చోట "(ప్రవక్తా) మేము నిన్ను సర్వమానవులకు శుభవార్త ఇచ్చేవాడుగా హెచ్చరిక చేసేవాడుగా నియమించి పంపాము. కాని చాలామంది మానవులు దీనిని ఎరుగరు" (సబా:28) ఆయన (స) ఇలా అన్నారు: "నేను ప్రపంచంలోని తెల్లవారు, నల్లవారు అయిన ప్రజలందరికోసం పంపబడ్డాను." (ముస్నద్ అహ్మద్)

## 4. హజ్రత్ ముహమ్మద్ (స) సందేశం నిరంతరమైనది

ఇప్పటి వరకు దైవసందేశం కేవలం ఆయా జాతులవారి కోసమే పరిమిత మయి ఉండింది. కాని హజ్రత్ ముహమ్మద్ (స) ఇచ్చిన సందేశం, బోధనలు ప్రళయం వరకు, రాబోయే అన్ని కాలాలవారి కోసం, అందరి కోసం ఇచ్చారు. అవి ఏ కాలానికైనా ఏ దేశానికైనా మానవులందరూ ఆచరించదగినవి. ఈ సందేశంలో అంతర్జాతీయ నియమాలు కూడా ఉన్నాయి.

"ఈ ఖురాను నా వద్దకు వహీ ద్వారా పంపబడింది. అది మిమ్మల్నీ ఇంకా, ఇది ఎవరెవరి వద్దకు చేరుతుందో, వారందరినీ నేను హెచ్చరించాలని." (అల్ అన్‌ఆమ్:19) మరొక వాస్తవం ఏమంటే మహనీయ (స) కంటే ముందు ప్రవక్తలకు ఏ అద్భుతాలయితే ఇవ్వబడ్డాయో అవి వారి వారి కాలాలకే పరిమితమయ్యాయి. అయితే మహనీయ (సల్లం) గారికి చదువు సంధ్యలు లేకపోయినా ఆయన (స)గారికి ఇవ్వబడిన ఖుర్‌ఆన్ ఆచరణాయోగ్య మయిన, విజ్ఞానదాయకమైన అద్భుత గ్రంథం. ఇది ప్రళయదినం వరకూ సురక్షితంగా ఉంటుంది. దివ్యఖుర్‌ఆన్ విశ్వజనీన గ్రంథం అని చెప్పడానికి ఇది కూడా ఒక నిదర్శనమే. *(అత్ తూర్ : 33, 34; హూద్ : 13–14; బనీ ఇస్రాయీల్ : 88; యూనుస్ : 38; అల్ బఖర : 23)*

## 5. హజ్రత్ ముహమ్మద్ (స)పై అవతరించిన దివ్య ఖుర్ఆన్ సురక్షిత గ్రంథం

ఖుర్ఆన్ దైవగ్రంథం word of God. అది మార్పులు చేర్పులు, హెచ్చు తగ్గులకు గురికాకుండా పవిత్రంగా ఉంది. అల్లాహ్ అంటాడు.

"ఈ జ్ఞాపిక (అంటే ఖుర్ఆన్)ను మేము అతరింపజేశాము. దానిని రక్షించే వారము కూడా మేమే." (అల్‌హిజ్ర్:93) అది అరేబియా భాషలో అవతరించి, ఆ భాషలోనే సురక్షితంగా ఉంది. దాని భాష ఈనాటికీ సజీవ భాష. కోట్లాది మందికి అది మాతృభాష. అంతర్జాతీయ సంబంధంగల భాష. దివ్యఖుర్ఆన్ వల్ల ఆ భాష స్థాయి మునుపటిలాగానే ఉంది. అందులో ఏలాంటి భేదం రాలేదు.

- దివ్యఖుర్ఆన్‌ను మహాప్రవక్త ముహమ్మద్ (స) కాలంలోనే సురక్షితంచేసే ఏర్పాట్లు చేయబడ్డాయి. హజ్రత్ ముహమ్మద్ (స) దానిని వ్రాయించి సురక్షితం చేశారు. ఆయన అనుచరులు మొత్తం గ్రంథాన్ని కంఠస్థం చేశారు. కారణం నమాజ్‌లో దానిని పఠిస్తారు కాబట్టి. దాని క్రమంకూడా ఆయన (స) కాలంలోనే సంపూర్ణ మయ్యింది. ఆయన(స) తరువాత ఖలీఫాలు ప్రభుత్వపరంగా ప్రచురించి సురక్షితం చేశారు. ప్రతి సంవత్సరం రమజాను మాసంలో రాత్రుల్లో (తరావీహ్ నమాజ్)లో దానిని వినిపించడం, వినడం ఆయన(స) కాలం నుండి ఈనాటి వరకు కొన సాగుతూ వస్తోంది. దివ్యఖుర్ఆన్ అవతరించిన కాలం నుండి ఈనాటి వరకు అది ఏలాంటి మార్పులకు గురికాలేదు ఇది చారిత్రక వాస్తవం.
- ఖుర్ఆన్ తన భాషలో, తన బోధనలో, విశాలమైన వ్యాసాలతో ప్రభావ వంతమైనది, అద్భుతమైనదీను. దాని వంటి గ్రంథం మరొకటి రచించి తీసుకురావాలని అది సవాలు కూడా చేస్తోంది. (అత్‌తూర్ : 33-34; యూనుస్ : హూద్, బనీఇస్రాయీల్ : అల్ బఖర : 23)
- దివ్యఖుర్ఆన్, గతించిన (తౌరాతు, ఇన్జీలు, జబూర్, మొదలయిన)

గ్రంథాలను ధృవీకరిస్తోంది. వాటిలోని దైవ బోధనలన్నీ ఇందులో వచ్చేశాయి. అ విధంగా ఇది వాటిని సురక్షితం చేస్తూ వారు ఏ అభిప్రాయ భేదాలలో పడిపోయారో వాటిని ఎత్తి చూపిస్తోంది. *(ఆలి ఇమ్రాన్ : 3; అల్ మాయిద : 48; అన్ నహ్ల : 64)*

- దివ్యఖుర్ఆన్ మానవులకు హితోపదేశం చేస్తున్న గ్రంథం. అదొక జ్ఞానదీపిక, సత్యాసత్యాలను వేరుపరచి చూపుతుంది. అది మంచి విషయాలతో నిండి ఉంది. అది నిజదృష్టాంతాలపై నిలిచి ఉంది. దాని ఒక్కొక్క మాట తిరుగులేనిది. అందువల్లనే అసత్యం అందులో ఏ దిశ నుండయినా ప్రవేశించజాలదు.ఎన్నో పరిశోధనా, పరిశీలనలు కూడా ఏ విషయాన్నయినా తప్పయినవని నిరూపించలేకపోయాయి. దివ్య ఖుర్ఆన్‌లో మాటిమాటికి ఆలోచించాలని, జ్ఞానాన్ని ఉపయోగించా లని చెప్పబడింది. *(అల్ బఖర:185; యూనుస్:57; అల్ ఖమర్ :17 హామీమ్ సజ్దా : 41-42;యూనుస్ 108; అన్ నిసా: 174; ఆలి ఇమ్రాన్ : 190; ఆరాఫ్ : 179)*

- దివ్యఖుర్ఆన్‌లో జీవన విధానాన్నీ అవసరమైన విషయాలన్నింటినీ వివరణా త్మకంగా బోధించడం జరిగింది. అందులో మానవులందరి కోసం హితోపదేశం ఉంది. ఈ సృష్టికి కర్త, యజమాని, అధికారి ఎవరు? సృష్టిలో మానవుని స్థానమేది? అనే విషయాలను అది ఎరుక పరుస్తుంది. ఇందులో దేవుని ఏకత్వం గురించి ప్రబోధించడం జరిగింది. దాంతోపాటు బహుదైవారాధనను ఖండించింది. గతించిన జాతుల సంఘటనల ద్వారా గుణపాఠం గరపబడింది. ప్రళయవార్తను వినిపించడం జరిగింది. పుణ్యాత్ములయిన ప్రజలకోసం స్వర్గపు శుభవార్త, పాపాత్ములకు నరకబాధ గురించి హెచ్చరిక చేయబడింది. మానవుల నైతికతను తీర్చిదిద్దే విషయా లను ఆరాధనా రీతులను తెలియజేస్తుంది. సామాజిక జీవితం కోసం హక్కులు, విధులు సవివరంగా తెలియజేయబడ్డాయి. అన్నపానీయాల విషయాలలో ధర్మసమ్మతం, అధర్మసమ్మతమైన ఆదేశాలు ఇవ్వబడ్డాయి.

ఆర్థిక విధానాలలో అసమ్మతమైన వాటికి సమ్మతమయిన వాటికి హద్దులు ఏర్పర్చబడ్డాయి. రాజకీయంలో అల్లాహ్‌కు అధికారం, మానవులలో సమానత్వం, న్యాయాలకు ప్రాధాన్యత ఇవ్వబడింది. న్యాయస్థానంలో సివిల్ లా, క్రిమినల్ లా, సైన్యంలో క్రమశిక్షణా నియ మాలు నిర్ధేశింప బడ్డాయి. యుద్ధనీతి ఇంకా అంతర్జాతీయ నియమాలను కూడా ఖుర్‌ఆన్ చర్చించింది.

- దివ్యఖుర్‌ఆన్ శైలి ఇతర గ్రంథాలకు అతీతమయినది. ఎందుకంటే ఇది ఒక ప్రత్యేక నేపథ్యంలో అవతరించింది. ఇందులో సందేశముంది, ఉద్యమమూ ఉంది. మానవ జీవితానికి సంబంధించిన విషయాలన్నీ సందర్భానుసారం వస్తూ ఉంటాయి. ప్రపంచం, పరలోకం గురించి కళ్ళముందున్న పరిసరాల గురించి సాక్ష్యం చెపుతూ ఉంటుంది. మానవ చరిత్ర గురించి గుణపాఠం నేర్పుతుంది. దృష్టాంతాలతో నచ్చజెప్పుతుంది. *(అష్షూరా : 7, అంబియా : 1; అల్ బఖర : 208; అన్ నహ్ల : 89)*

"యదార్థం ఏమిటంటే, ఈ ఖురాను పూర్తి సరియైన సవ్యమైన మార్గాన్ని చూపుతోంది. తనను విశ్వసించి, మంచి పనులను చేసేవారికి గొప్ప ప్రతిఫలం ఉందనే శుభవార్తను అందజేస్తోంది." *(బనీఇస్రాయీల్ :9)*

## 6. హజ్రత్ ముహమ్మద్ సల్లం జీవిత చరిత్ర సురక్షితంగా ఉంది

హజ్రత్ ముహమ్మద్ (స) తరువాత, ఆయన అనుచరులు, వారి అనుచరులు వీలయినంత ప్రామాణికతతో ఆయన (స) ప్రవచనాలు, ఆచరణలను సవివరంగా సురక్షితం చేశారు. ఆయన (స) ప్రవచనా(హదీసు)లను పరిశీలించడానికి నియమాలు ఏర్పర్చబడ్డాయి. దీనివల్ల హజ్రత్ ముహమ్మద్ (స) వ్యక్తిత్వం, ఆయన కాలంనాటి సంపూర్ణ స్థితిగతులను,యోగ్యతలను తెలుసుకోవడంలో ఎలాంటి అడ్డంకులు ఎదురవవు. ఈ విషయం మనకు ముఅత్తా, బుఖారి, ముస్లిం, తిర్మిజి, ఇబ్నెమాజా, నిసాయి, అబూదావూద్ ఇంకా వఅఖ్ది, ఇబ్నెహాషిం, వగైరా గ్రంథాలలో లభిస్తుంది. ఈ విధంగా

దివ్యఖుర్ఆన్, హదీసులు ప్రవక్త (స) సంప్రదాయం, బోధలన్నీ ప్రామాణికం కలిగి ఉన్నాయి. అందువల్లనే మహాప్రవక్త (స) ఇలా అన్నారు : "నేను మీ వద్ద రెండు విషయాలను వదిలి వెళుతున్నాను. వాటిని గనక మీరు గట్టిగా పట్టుకుని ఉంటే ఎన్నడూ మార్గం తప్పిపోరు. ఒకటి దైవం గ్రంథం, రెండవది నా సంప్రదాయం. *(ముఅత్త)*

## 7. హజ్రత్ ముహమ్మద్ సల్లం ఇస్లామీయ సంస్కృతి వ్యవస్థాపకులు

హజ్రత్ ముహమ్మద్ (స) కేవలం ధర్మప్రచారమే చేయలేదు. పైగా ఆయన (స) దానిని స్థాపించి ఒక సంపూర్ణమైన నూతన సంస్కృతికి అంకురార్పణ చేశారు. ఆయన(స) తను బోధించిన బోధనలకు అనుగుణంగా సజీవమయిన ఒక వ్యవస్థను స్థాపించి ప్రపంచం ముందుంచారు. ఇస్లామీయ చరిత్రలోనే ఇది మహోన్నతమైన విప్లవోద్యమం.

- 23 సంవత్సరాల స్వల్ప కాలంలోనే ఒక జాతి మొత్తాన్ని, దాని ఆలోచనా విధానాన్ని, దాని సామూహిక జీవితాన్ని మార్చివేశారు. ఇస్లాం పేరుతో అరేబియా ప్రాంతం నుండి ప్రారంభమయి సిరియా, స్పెయిన్, ఈజిప్ట్, ఈరాన్, భారతదేశంలో అది తూర్పు వరకు విస్తరించింది. ముస్లిములు ఇస్లాంలోని ప్రతి రంగంలోనూ పరిశోధనా, పరిశీలనలలో కృషి చేశారో అప్పటివరకు వారు ధార్మిక, ప్రాపంచిక విద్యలలో నాయకపాత్ర పోషించారు. జీవన గమనంలో, పరిశ్రమలలో, వ్యాపార రంగాలలో, రాజకీయ అధికారాలలో కళారంగాలలో, కట్టడాలలో వారు ఒక ప్రత్యేక గుర్తింపును పొందారు. మరే మత నాయకునిలో లేనటువంటి ప్రత్యేకతలు ముహమ్మద్ (స)లో ఉన్నాయి.

## క్రీ.శ. ఆరవ శతాబ్దంలో అరేబియా

హజ్రత్ ముహమ్మద్ (స) కంటే ముందు ప్రపంచం (ఏథెన్స్, ఈరాన్, భారత్, ఈజిప్ట్‌ల)లో నిజ దైవ తిరస్కారంతో బహుదైవారాధనలు చేస్తూ

సామాజిక, నైతిక, ఆర్థిక చెడులలో లీనమయి ఉంది. ప్రపంచంలో చట్ట రాహిత్యం, దౌర్జన్యం, కల్లోలాలు ప్రబలిపోయాయి. దివ్యఖుర్‌ఆన్ ఆనాటి పరిస్థితులను ఇలా ఉటంకించింది.

**"జహరల్ ఫసాదు ఫిల్ బ్రిరివల్‌బహ్‌రి బిమాకసబత్ అయిదిన్నాసి"**

"మానవులు చేజేతులా సంపాదించుకున్నదాని ఫలితంగానే నేలపైనా, నీటిలోనూ కల్లోలం చెలరేగింది." *(అర్‌రూమ్:41)* ఇంకా...

● ఆ కాలంలో నాస్తికులు, కాఫిర్‌లు అనేక దైవాలను ఆరాధించేవారు కూడా ఉండేవారు.

హజ్రత్ నూహ్ (అలై) కాలంలో అనేక దేవతా విగ్రహాలు అంటే అద్దా, సువా, యగూస్, యఊఖ్, నస్ర్ విభిన్న తెగలలో ఆరాధించపబడేవి. బఅల్, లాత్, ఉజా, మనాత్‌లు కూడా వారి ప్రముఖ దేవుళ్ళు. వారు సఫా మర్వాలపై అసాఫ, నాయెలలను కాబా గృహంలోనూ అనేక విగ్రహాలు ప్రతిష్టించి ఉండేవి. అలాగే అందులో హజ్రత్ ఇబ్రాహీం అలై హజ్రత్ ఇస్మాయీల్ అలై చిత్రాలు కూడా అలంకరించారు. ఈ విగ్రహాల ద్వారానే మేము దేవుని దాకా చేరుకోగలుగుతామని భావించేవారు. విగ్రహాల ప్రసన్నతకోసం బహీరహ్, సాయిబహ్, వసీలహ్ హామ్ వగైర పేర్లతో పశువులను పుణ్యఫలం కోసం విడిచేవారు. విగ్రహాలకు మొక్కుబడులు చెల్లించేవారు, ఆ స్థానాలపై బలులు అర్పించేవారు. వాటి రక్తం, మాంసం కాబా గృహం గోడలకు అంటించేవారు. ఆ విగ్రహాలు వారికోసం సిఫారసు చేస్తాయని నమ్మేవారు. దైవదూతలను దేవుని కూతుళ్ళుగా భావించేవారు. జ్యోతిష్యులను, నక్షత్రా(షిరా నక్షత్రం)లను కూడా ఆరాధించేవారు. ఇన్ని రకాల ఆరాధనలు వారిని మూఢనమ్మకాలలో, జ్యోసం చెప్పించుకోవడంలో, శకునాలలో లీనం చేసేవి. బహుదైవారాధన విషయంలో: మా తాత ముత్తాతలు ఇలా చేస్తూ ఉండగా మేము చూశాము. అనడం కంటే మరే నిరూపణ వారి వద్ద లేకపోయింది. *(నూహ్ : 23; అన్ నజమ్ : 19, 20, 49, అన్‌సఫ్ : 125, అల్ మాయిద : 90, 103, అల్*

*అంబియా : 52, 53, అల్ హజ్ : 37, అన్ నహ్ల్:57, అత్ తూర్ :29, యాసీన్ : 18, 19 అల్ జాసియా: 24, అల్ మూమినూన్: 37, యూనుస్ : 18, అర్ రూమ్:13)*

- బహుదైవారాధనల సంప్రదాయమే వారి ఆరాధన. చప్పట్లు కొట్టడం, ఈలలు వేయడం, దిగంబరంగా ప్రదక్షిణలు చేయడంతోపాటు హజ్ సందర్భంగా కూడా నడిచేది. కథలు చేప్పేవారు. కవి సమ్మేళనాలు జరిగేవి. తాత, ముత్తాతల ఘనకార్యాలను గర్వంగా చెప్పుకునేవారు. ఇవన్నీ జరిగి హజ్ కాస్తా జాతరగా మారిపోయేది. *(అల్ అన్ఫాల్ : 35, అల్ ఆరాఫ్ :31, అల్బఖర:22)*

- ధర్మసమ్మతం– అధర్మసమ్మతం ఏదైనా నిర్ణయించే సత్తా వారికే ఉండేది. వారు ఏది కోరుతారో ఎవరికోసం కోరుతారో, వారే దానిని హలాల్, హరాంగా నిర్ణయించేవారు. అకారణంగా అల్లాహ్కు అబద్ధాలు ఆపాదించేవారు. దానంతట అది చచ్చిన పశువు, రక్తం, పందిమాంసం, దైవేతరుల పేరు ఉచ్చరించబడిన జంతువులు తినేవారు. (అన్ నహ్ల్ :115-116) వివాహాలకు, వావివరుసలకు హద్దులు ఉండేవికావు. ఇతరుల వివాహబంధంలో ఉన్న స్త్రీలను మరొకరు వివాహం చేసుకోవడం, ఇద్దరు అక్కాచెల్లెళ్లను కలిపి పెళ్ళి చేసుకోవడం న్యూనతగా భావించేవారు కాదు. ఎందరికో తలాఖ్ ఇచ్చేవారు. స్త్రీల హక్కులను కాజేసేవారు. బంధువులను ఆదరించేవారు కాదు. సారాయి అంటే వారికి ప్రాణం కన్నా మిన్న. స్త్రీలు విచ్చలవిడిగా తిరిగేవారు. వ్యభిచారాన్ని పాపంగా పరిగణించేవారు కాదు. అశ్లీలంగా ప్రవర్తించడం సిగ్గుమాలిన పనులు చేయడం అంటే వారికి మహాఇష్టం. పొరుగువారిని వేధించడం; దౌర్జన్యం చేయడం వారి అనవాయితి. నిరుపేదలకు సహకరించేవారు కాదు. కవిత్వం వినిపించడం, కథలు చెప్పడం, గానా బజానాలలో తేలియాడడం. *(వారికి ఇష్టమైన కార్యాలు). (అన్ నిసా :3, 22, 23, 36, అల్ అహ్జాబ్:4, 33, అల్మాయిద:90, బనీఇస్రాయీల్: 32,*

*అల్ అన్ఆమ్ :151, అల్ఫజర్ : 17–20, లుఖ్మాన్: 6, అన్నజ్మ్ : 60–61)*

- అనాథల సొమ్ము తినేవారు. వారి ఆస్తిని కాజేసేవారు. పాచికలు వేయడం, జూదం ఆడడం వారికి సరదా. వడ్డీని వ్యాపారంగా భావించేవారు. బానిస స్త్రీలతో వ్యభిచారం చేయించేవారు. అపమార్గం (మోసం, వంచన) అవినీతుల ద్వారా డబ్బు సంపాదించేవారు. యుద్ధాలలో సొమ్ము దొంగిలించేవారు. సంతానంపై, అనవసరమైన ఖర్చుపై గర్వపడేవారు. కాని దైవమార్గంలో ఖర్చు చేయడానికి మాత్రం వెనుకాడేవారు. డబ్బే వారికి సర్వస్వం. *(అల్ ఆదియాత్: 8; అన్ నిసా: 29, 30, 37, అన్ నూర్ 33, అల్ ముద్దసిర్: 11–30)*
- నాలుగు (జీఖాదహ్, జిల్హిజ్జ, మొహర్రమ్, రజబ్) నెలలు తప్ప, శాంతి అనేది ఉండేదే కాదు. దుర్మార్గంలో మునిగినవారు, తెగలలో పక్షపాతం, కక్ష సాధింపు చర్యలు, ప్రతీకారం తీర్చుకోవడం కోసం సుదీర్ఘకాలం వరకు యుద్ధాలు చేస్తూ గడిపేవారు. రాత్రుళ్ళల్లో దోపిడీలు, హత్యలు చేసేవారు. పగలు కిడ్నాపులు చేసి బలహీనులను బానిసలుగా చేసుకునే వారు. మనుషుల అమ్మకం, కొనుగోలు జరిగేది. వాగ్దాన భంగం చేసే వారు. యుద్ధాలలో నియమాలు ఉండేవికావు. ఖైదీలపట్ల అతిగా ప్రవర్తించేవారు. హత్యకు ప్రతి హత్యలో తీవ్రంగా స్పందించేవారు. యుద్ధంలో ఎవరికి సొమ్ము దొరికేదో దానికి వారే హక్కుదారులయ్యేవారు. *(అత్తౌబ: 36, అల్ ఆదియాత్: 1–6, అన్కబూత్: 67, బనీఇస్రాయీల్ : 33)*

## అరబ్బు జాతి ప్రత్యేకతలు

చాలా మంది అరబ్బు జాతిలో ఉన్న చెడులనే చెపుతుంటారు. కాని వారిలోని ప్రత్యేకతల పట్ల చాలా తక్కువగానే శ్రద్ధ చూపడం జరిగింది.

- మహాప్రవక్త (స) జన్మించినప్పుడు అరబ్బు జాతి ఎడారిలోనే నివసించేది.

ఒక స్వతంత్ర జాతిగా ఉండేది. వారిపై ఎవరి ఆధిపత్యం ఉండేదికాదు. వారు ఏ సంస్కృతిని కూడా అవలంభించలేదు. సామాన్య జీవితం వారిది. వారు ప్రశాంత సుఖజీవనం ఎరుగరు. దేశదిమ్మరిగాను, గొర్రెల కాపరిగాను, ఖర్జూరపు తోటలలో పని చేయటం వల్లను, వ్యాపారం గుడారాలుగా జీవించడం వల్లను వారు కష్టజీవులు. వారిలో ధైర్యసాహసాలు మెండుగా ఉండేవి. గుర్రపు స్వారి, ఖడ్గాలు, బల్లాల పోటీలలో ఆరితేరిన వారు. ఫలితాన్ని చూడకుండా ప్రమాదాలను ఆలింగనం చేసుకునేవారు. తెగల వ్యవస్థ సుదీర్ఘకాలం నుండి కొనసాగుతూ వచ్చేది.

వారిలో కొన్ని నైతిక విలువలు కూడా ఉండేవి. దాతృత్వం; అతిథి సత్కారం, బంధుప్రీతి సహృదయం వంటి సుగుణాలు కలిగి ఉండేవారు. అనాగరికులయినప్పటికీ వారికి కాబా గృహం పట్ల గౌరవం ఉండేది. హజ్రత్ ఇబ్రాహీం (అలై) తమ నాయకునిగా భావించి గౌరవించేవారు. గతించిన ప్రవక్తల విషయాలు కొన్ని వారికి తెలిసినవే. భౌగోళికంగా మక్కా, మదీనా ప్రపంచంలో కేంద్రస్థానం కలిగి ఉండేవి.

## హజ్రత్ ముహమ్మద్ (స)గారి సంక్షిప్త జీవితం

హజ్రత్ ముహమ్మద్ సల్లం వంశావళి హజ్రత్ ఇబ్రాహీం అలై దాకా చేరు తుంది. ఆయన (స) ప్రముఖ ఖురైష్ వంశానికి చెందినవారు. కాబా గృహం అర్చకులు ఆయన (స) వంశం వారే. ఆయన (స) తండ్రిపేరు అబ్దుల్లా. తాత పేరు అబ్దుల్ ముత్తలిబ్. ఆయన సల్లం మక్కా నగరంలో 22 ఏప్రిల్ క్రీ.శ. 571న అనాథగా జన్మించారు. ఆరు సంవత్సరాల తరువాత తల్లి బీబీ ఆమీన పరమపదించారు. ఎనిమిదవ ఏట వరకు తాతగారు పోషించారు. ఆ తరువాత బాబాయి అబూతాలిబ్ అల్లారుముద్దుగా పెంచి పోషించారు. పిన్న వయస్సులోనే బాబాయిగారితో వ్యాపారం నిమిత్తం సిరియా వెళ్ళారు. యువకులయిన ఆయన (స) తెగల మధ్య దౌర్జన్యానికి బదులు న్యాయవంతమయిన "హిల్‌ఫుల్‌జూల్" అనే ఒప్పందంలో పాల్గొన్నారు.

మక్కానగరానికి చెందిన ధనవంతురాలు, వ్యాపారవేత్త అయిన స్త్రీ హజ్రత్ బీబీ ఖదీజా. సరుకును వ్యాపార నిమిత్తం తీసుకుని బిడారులతో కలసి సిరియా వెళ్ళి వ్యాపారం నుండి విజయవంతంగా తిరిగి వచ్చారు. ఇరవై అయిదు సంవత్సరాల వయస్సులో ఆయన వివాహం 40 సంవత్సరాల వయస్సు గల వితంతువైన ఖదీజాతో జరిగింది.

- ఆయన జీవితం ఉన్నత నైతికత కలిగిన జీవితం. బహుదైవారాధనపట్ల, సారాయి పట్ల, అశ్లీలంపట్ల, నృత్యగానాలపట్ల, అన్యాయం పట్ల, దౌర్జన్యం పట్ల ఆయనకు తీవ్రద్వేషం ఉండేది. ఆయన (స) ఆపద సమయాలలో ప్రజలను ఆదుకునేవారు, వారి సమస్యలను పరిష్కరించేవారు. ప్రజలు ఆయన తెలివితేటలకు ముగ్ధులయ్యేవారు. ఆయన వ్యవహారశైలిపై భరోసా కలిగి ఉండేవారు. వారిలోని అభిప్రాయభేదాలను ఆయన ద్వారా పరిష్కరింపచేసుకునేవారు. సమాజం ఆయన పట్ల గౌరవ ప్రపత్తులతో మెలిగేది. ఆయనలోని అత్యున్నత నైతికతకు ప్రభావితులైన ప్రజలు ఆయనను సాధిఖ్, అమీన్ అనే బిరుదులతో సత్కరించారు.
- హజ్రత్ ముహమ్మద్ (స) వయస్సు నలభై సంవత్సరాలకు చేరేసరికి అల్లాహ్ ఆయనపై ఖుర్ఆన్ అవతరింపజేశాడు. తన సందేశాన్ని వినిపించడానికి మానవాళి అందరి వైపునకు ఆయనను తన ప్రవక్తగా పంపించాడు. ఆయన (స) లాఇలాహ ఇల్లల్లాహు వచనంతో తన సందే శాన్ని ప్రారంభించారు. ప్రప్రథమంగా ఆయన(స) తన సమీప బంధువులకు, మిత్రులకు ఇస్లాం పరిచయం చేశారు. ఆ తరువాత ఆ సందేశాన్ని సామాన్యులకు కూడా వినిపించారు. మేలుతరమయిన స్వభావం గలవారు ఆయన సందేశాన్ని స్వీకరించారు. వారిలో ధనిక, పేద అందరూ ఉన్నారు. బానిస స్త్రీ, పురుషులు కూడా ఇస్లాంలో చేరిపోయారు. హజ్రత్ ముహమ్మద్ (స) ఆ నవ ముస్లిములకు విద్యాబోధన శిక్షణ ఇచ్చేవారు. ప్రపంచ సందేశకులుగాను, వారు సత్యాసత్యాల పోరాటంలో నిలకడగా ఉండేలాను, సత్యంకోసం ప్రాణాలర్పించగలిగే వారిగా తీర్చిదిద్దారు.

ఈ సందేశాన్ని వ్యతిరేకించినవారు శత్రుత్వంపై స్థిరంగా నిలిచారు. హజ్రత్ ముహమ్మద్(స)ను ఎగతాళి చేశారు. డబ్బు, అధికారం, అందమైన అమ్మాయిల గురించి ఆశపెట్టారు. ఆయన (స) వారితో: మీరు నా ఒక చేతిలో సూర్యుడిని, ఒక చేతిలో చంద్రుడిని తీసుకువచ్చి పెట్టినా నేను ఇస్లాం ప్రచార కార్యాన్ని విడనాడలేను, ఇస్లామయినా స్థాపించబడాలి లేదా నా ప్రాణమయినా పోవాలి అని అన్నారు. ఇలా వారి పాచికలు పారనందుకు వారు ఆయన అనుచరులపై దౌర్జన్యాలు చేయడం ప్రారంభించారు. వారిని అనేక విధాలుగా వేధించారు. మండుతున్న ఇసుకపై పరుండబెట్టారు. నిప్పులపై వెల్లకిలా పడుకోబెట్టారు. వారి భయంకరమైన శిక్షలకు తాళలేక కొందరు అమరులైపోయారు. ఆయన (స) తన అనుచరులతో "తాము చెయ్యెత్తకుండా ఉండాలని, సహనం వహించాలని" హితవు చేసేవారు. ముస్లింలలో చాలామంది ఇక వేగలేక మక్కా నగరం విడిచి 'హబ్ష' అనే ప్రాంతానికి హిజ్రత్ చేసి వెళ్ళిపోయారు. (హిజ్రత్ అంటే వలసపోవడం) అ తరువాత ముహమ్మద్ సల్లంను, ఆయన వంశస్థులు మక్కానుండి వెలివేశారు. "షిబ్అబీతాలిబ్" అనే కనుమలో నిర్బంధించారు. చివరికి వారే నిర్బంధం ఎత్తివేశాక మక్కాలో ఇస్లాం సందేశ ప్రచారాన్ని నిషేధించారు. హజ్రత్ ముహ్మద్ సల్లం ఎంతో ఆశతో పొరుగున ఉన్న 'తాయెఫ్' నగరానికి వెళ్ళారు. వారు ఆయనను వ్యతిరేకించి, రాళ్ళతో కొట్టి శరీరమంతా రక్తసిక్తం చేశారు. ఆ మధ్యనే మేరాజ్[6] సంఘటన జరిగింది. మేరాజ్‌లో అల్లాహ్ తరఫునుండి ఐదు పూటల నమాజు బహుమానంగా లభించింది. ఇస్లామీయ రాజ్య స్థాపనకు కావలసిన చట్టాలు కూడా లభించాయి. ఆ తరువాత ఆయన సల్లం

---

6. మేరాజ్ అంటే అధిరోహించడం అని అర్థం. ఒకనాటి రాత్రి దైవదూత జిబ్రాయీల్ అలై మహాప్రవక్తసల్లం ను ఏడు ఆకాశాలపైన ఉన్న అల్లాహ్ వద్దకు తీసుకెళ్ళాడు. అల్లాహ్‌తో సంభాషించి తిరిగి వచ్చేటప్పుడు దేశపరిపాలనా విధానం, శాసనాలతో పాటు, ప్రతిరోజు ఐదుపూటలు నమాజు చేయాలని దానిని బహుమానంగా ఇవ్వడం జరిగింది.

హజ్, ఉమరహ్ యాత్రలకు వచ్చేవారితో వివిధ తెగలవారితోనూ సంబంధాలు ఏర్పరుచుకున్నారు. మదీనా వాసులైనా అన్సార్‌లు తమ ధన ప్రాణాలు పణంగా పెట్టయినా సరే మేము మీకు తోడుగా నిలుస్తామని వాగ్దానం చేశారు. (బైతెఉఖ్బా) ఇంకా వారు దైవప్రవక్తగా, నాయకునిగా మదీనా రావలసిందిగా ఆహ్వానించారు. దైవదౌత్యం లభించిన పదమూడు సంవత్సరాల తరువాత హజ్రత్ ముహమ్మద్ (స) ఎంతో వివేకంతో, అల్లాహ్‌ను నమ్ముకుని తమ స్నేహితుడయిన అబూబక్ర్ (రజి)ని తోడుగా తీసుకుని మక్కా నుండి హిజ్రత్ చేసి మదీనా చేరుకున్నారు.

హిజ్రత్ చేసి మదీనా చేరుకున్నాక ఆయన (స) చేసిన మొట్టమొదటి పని మస్జిద్ నిర్మాణం. ఆ తరువాత అన్సార్[7], మహాజిర్[8] లలో సౌభ్రాతృత్వం నెలకొల్పారు. చుట్టుపక్కల ఉన్న యూదులతో సామాజిక ఒప్పందాలు చేసుకున్నారు. (మదీనా ఒప్పందం) మదీనా పరిరక్షణ కోసం గస్తీ ఏర్పాటు చేశారు. వీటివల్ల మదీనాకు ఒక రాష్ట్రంగా గుర్తింపు లభించింది. మక్కా ఖురైషీయులు ముహమ్మద్ (స) శత్రుత్వం వల్ల యుద్ధానికి తెరలేపారు. ఆ విధంగా బదర్ యుద్ధం, ఉహుద్ యుద్ధం, కందక యుద్ధాలు జరిగాయి. అల్లాహ్ ఎల్లప్పుడు మహాప్రవక్త (స)కు సహాయం చేస్తూ వస్తున్నాడు. దాదాపు ఆరు సంవత్సరాల తరువాత పధ్నాలుగు వందల మంది అనుచరులతో ఉమరహ్ చేయడానికి మదీనా నుండి మక్కాకు బయలుదేరారు. కాని మక్కా ఖురైషీలు ఆయన (స)ను మక్కా ఆవల నిలిపివేశారు. సుదీర్ఘ మంతనాల తరువాత హజ్రత్ ముహమ్మద్ (స) శాంతి పరిఢవిల్లడానికి వివేకం, దూరదృష్టితో వారి షరతులను అంగీకరించి ఒప్పందం చేసుకున్నారు. (సులహ్ హుదైబియా-హుదైబియా ఒప్పందం) ఈ ఒప్పందంవల్ల పరిస్థితులలో మార్పు రాసాగింది. మక్కా మదీనాకు ప్రజల రాకపోకలు ప్రారంభమయ్యాయి.

7. అన్సార్ అంటే సహాయకులు, మదీనా వాసులు అని అర్థం.
8. మహాజిర్ అంటే మక్కానుండి హిజ్రత్ చేసి (వలస) మదీనా వచ్చిన ముస్లిములు.

ఇది శుభసూచకం. ఆయన (స) ప్రపంచవాసులందరి కోసం ప్రవక్తగా చేసి పంపించబడ్డారు. అందువల్ల ఆయన (స) ఇస్లాం సందేశాన్ని అంతర్జాతీయంగా ప్రచారం మొదలుపెట్టారు. ఈరాన్, రోము, ఈజిప్ట్, హబ్ష రాజులకు, ఇతరులకు, ఇంకా అరబ్బు అధికారుల పేర దైవసందేశ పత్రాలను ప్రత్యేక రాయబారుల ద్వారా పంపించారు. ఆ తరువాత ఖురైషీయులు రెండు సంవత్సరాలకు తమ ఒప్పందాన్ని ఎత్తివేశారు. హజ్రత్ ముహమ్మద్ (స) తన పదివేల మంది అనుచరులతో ఏలాంటి రక్తపాతం లేకుండా మక్కాను కైవసం చేసుకున్నారు. అప్పుడు శత్రువు లందరినీ క్షమించారు. మక్కా విజయం తరువాత 'తాయెఫ్' "ఔతాస్" "హునైన్" యుద్ధాలు సంభవించాయి. ఆయన (స) వేలాదిమంది ఖైదీలను విడుగల చేశారు. యుద్ధంలో లభించిన సమర సొత్తును అక్కడి కక్కడనే నవముస్లింలలో పంచివేశారు. ఆ తరువాత ప్రజలు గుంపులు గుంపులుగా ఇస్లాంలో చేరిపోయారు.

- చివరి కాలంలో రోము దేశపురాజు దండయాత్రకు బయలుదేరాడని తెలిసింది. విపరీతమైన ఎండ వేడిమిలో యుద్ధసామగ్రి అంతంత మాత్రంగానే ఉన్నా"తబూక్" ప్రాంతంవైపు బయలుదేరారు. మహ నీయ(స) ప్రాబల్యానికి జడిసి శత్రువులు రణరంగం నుండి పలాయన మయ్యారు. ఫలితంగా యుద్ధం జరగలేదు. అయినా కొద్దిరోజులు ఆయన అక్కడనే మకాం వేశారు. ఆ సందర్భంలో ఉత్తరంలో ఉన్న తెగలవాళ్ళు మదీనా ప్రభుత్వాన్ని ధృవీకరించాయి. వారి మధ్య ఒప్పందాలు జరిగాయి. అ విధంగా ఆయన మదీనా విజేతగా తిరిగి వచ్చారు. రాగానే ఆయన కపటులను ఏరివేశారు. మరణానికి మూడు నెలల ముందు ఆయన(స) చివరి హజ్ చేశారు. ఇందులో ఒక లక్షమంది కంటే అధికంగా అనుచ రులు పాల్గొన్నారు. ఆయన (స) తన చివరి ప్రసంగంలో ముఖ్య విషయా లను ప్రస్తావించారు. అవి ఇవి:

- వంశం, రంగు, భాషల వ్యత్యాసాన్ని నిర్మూలించి మానవ హక్కుల సమానత్వానికి రాచబాట వేశారు.
- మానవహక్కులు (ప్రత్యేకించి స్త్రీల-బానిసల హక్కు) నిర్వర్తించాలని ఆదేశించారు.
- అజ్ఞానకాలపు ఆచారాలను అంతంచేస్తున్నానని ప్రకటించారు.
- పరస్పర వ్యవహారాలను చక్కగా నిర్వర్తించాలని తాకీదు చేశారు.
- వడ్డీ నిషేధించారు.
- పవిత్రమైన సమాజస్థాపన కోసం అశ్లీలానికి శిక్షలు వినిపించారు.
- ముస్లిములు సత్యానికి సాక్షులుగా నిలువాలని మాటిమాటికి హితువు చేశారు.
- మార్గభ్రష్టతకు లోనుకాకుండా ఉండాలంటే దివ్యఖుర్ఆన్ ప్రకారం ఆచరిం చాలని శాసించారు.
- హజ్రత్ ముహమ్మద్ (స) మరణించేనాటికి మొత్తం అరేబియా ఇస్లాం ఛాయలోకి వచ్చేసింది. ఆయన క్రీ. శ. 630 హిజ్రిశకం పదవ సంత్సరం తన 63వ ఏట పరమపదించారు. మదీనాలో ఖననం జరిగింది. ఇన్నాలిల్లాహి వఇన్నా ఇలైహిరాజిఊన్[9]
- మానవ మహోపకారి మహనీయ(స)పై అనంతంగా శాంతికురియుగాక! ఆయన(స) తరువాత సుశిక్షితులయిన ఆయన (స) అనుచరులు ఆయన ఉద్యమాన్ని కొనసాగించారు. అల్లాహ్ వారితో ప్రసన్నుడయ్యాడు. వారు అల్లాహ్‌తో ప్రసన్నులయ్యారు.

## దైవదౌత్యం కాలంలో జరిగిన యుద్ధాలు

నియమానుసారం తెలుసుకోవలసిన విషయం ఏమిటంటే ఇస్లాం మానవులంతా సమానమని బోధిస్తుంది. అదే విధంగా మానవత్వాని గౌరవించాలని కూడా కోరుతోంది. ఇస్లాంలో కులమతవర్గ భేదం లేకుండా

ప్రతి మనిషి ప్రాణాన్ని గౌరవించవలసిందే. ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా ఉపదేశిస్తున్నాడు:

"ఒక మానవుణ్ణి చంపినవాడు సమస్త మానవులను చంపినట్టే. ఒక మానవుడి ప్రాణాన్ని కాపాడినవాడు మొత్తం మానవుల ప్రాణాలను కాపాడినట్టే" (అల్ మాయిద:32)

"సత్యంతో తప్ప. అల్లాహ్ పవిత్రంగా నిర్ణయించిన ఏ ప్రాణాన్నీ హత మార్చకండి." (అల్ అన్‌ఆమ్ : 151; బనీఇస్రాయీల్ :33) అంటే కావాలని హత్య చేయరాదు. అయితే ఇస్లామీయ రాజ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసినందుకు, భూమిపై కల్లోలాలు సృష్టించినందుకు, యుద్ధమైదానంలోనూ, వ్యభిచారానికి మరణశిక్ష విధించవచ్చు. ఇంకా అకారణంగా హత్యచేయడం ఇస్లాంలో మహాపాపం. వ్యక్తిగత ప్రతీకారానికి ఇస్లాంలో తావులేదు. మహ నీయ(స) జీవితచరిత్ర వ్రాసేటప్పుడు వారి యుద్ధాల గురించి బాగా వ్రాస్తారు. కాని, వాస్తవం ఏమంటే మహనీయ (స) దైవదౌత్య కాలంలో జరిగిన యుద్ధాలలో ఇరువైపుల మరణించినవారు దాదాపు 1200 మంది మాత్రమే. హజ్రత్ ముహమ్మద్ (స)ను అల్లాహ్ ప్రపంచవాసులందరి మార్గదర్శనం కోసం కారుణ్యంగా చేసి పంపించాడు. ఆయన హృదయం కరుణామృతాలతో నిండి లేకపోతే, మక్కా విజయం సందర్భంలో 21 సంవత్సరాల శత్రుత్వానికి ప్రతీకారం తీర్చుకోడానికి పూనుకొని ఉంటే, ఆయన ముందు తలలు వంచుకుని నిలుచున్న వారిలో ఒక్కడు కూడా మిగిలేవాడు కాదు. కాని ఆయన అందరినీ (Amnesty) క్షమించారు. హజ్రత్ ముహమ్మద్ (స) దైవప్రవక్త అనడానికి అతిపెద్ద నిదర్శనం ఇది.

- ఆయన (స) స్వయంగా ఏ యుద్ధానికీ పాల్పడలేదు. కాని శత్రువులే యుద్ధంకోసం ప్రేరేపించారు. మక్కా ఖురైషీయులు ఇతర అరబ్బు తెగల వారిని ఆయన(స)కు వ్యతిరేకంగా పురికొలిపి మదీనాపై దాడి చేయిం చేవారు. ఆత్మరక్షణ చేసుకోవడం మనిషి హక్కు. ఆ హక్కు నుండి దూరం చేయడం నేరం. నిజానికి ప్రపంచానికి యుద్ధ నియమాలు తెలియజేసింది

దైవప్రవక్త (స) గారే. జీవన ప్రమాణాల కోసం, అభివృద్ధి కోసం ఒక్కొక్కసారి యుద్ధం అనివార్యమవుతుంది. అయితే యుద్ధం నియమ నిబంధనల పరిధిలో జరగాలి. ఆటవిక విధానం కాకూడదు. హజ్రత్ ముహమ్మద్ (స) అన్నారు: స్త్రీలను, పిల్లలను, వృద్ధులను, పూజారులను హతమార్చరాదు. కోతకువచ్చిన చేనులను, చెట్లను నాశనం చేయరాదు. శవాలను అపవిత్రం చేయరాదు. ఖైదీలపట్ల అమానవీయంగా ప్రవర్తించరాదు. యుద్ధఫలాన్ని సైన్యాధిపతికి అప్పగించాలి.

- హజ్రత్ ముహమ్మద్ (స)గారు మంచి ప్రవర్తన కలిగిన యోధులను ప్రపంచానికి పరిచయం చేశారు. ఇస్లామీయ సైనికులు ఏ దేశంపై తమ జెండా ఎగురవేసినా అక్కడి ప్రజలు వారిని తమ ధన, మాన, ప్రాణాల రక్షకులుగానే భావించారు.
- ఉగ్రవాదానికి జిహాద్‌కు చాలా తేడా ఉంది. ఉగ్రవాదాన్నీ, వినాశనాన్ని ఇస్లాం భూమిపై కల్లోలాలుగా పేర్కొంటోంది. ఇస్లాంలో జిహాద్ రాజ్య విస్తరణ కోసం చేయరాదు. అది జిహద్ అనబడదు. భూసంపద కబ్జా చేయరాదు. ధనపిపాస, లేక నియంతృత్వాన్ని, అణ్వాయుధాలను, రసాయనిక ఆయుధాల తయారీలను, శౌర్య ప్రదర్శనను వ్యతిరేకిస్తుంది. జిహాద్ అంటే దేశం- ముస్లిం సమాజ సంస్కరణ కోసం, మత రక్షణ కోసం, దౌర్జన్యానికి గురయిన వారికి సహాయం చేయడంకోసం, అల్లాహ్ ఏకత్వాన్ని చాటడంకోసం చేయవలసిన నిరంతర కృషి. మానవుడిని, మానవుని బానిసత్వం నుండి విడిపించి, దేవుని దాసులుగా చేయడానికి చేసే కృషి అది, ఎందుకంటే అందులోనే వారి మేలు ఉంది గనక.
- ఇస్లాంలో శాంతి కోసం యుద్ధ భావన దౌర్జన్యం కాదు. అది ఉపకారం. హజ్రత్ ముహమ్మద్ (స) నుండి ఈనాటి వరకు ఎవరయినా సరే ఖడ్గం ద్వారాగాని, బలవంతంగాగాని ఇస్లాం స్వీకరింపజేసిన దాఖలాలు లేనేలేవు. దివ్యఖుర్ఆన్ ఇలా అంటోంది:

**"లకుమ్‌దీనుకుమ్ వలియదీన్"** 'మీ ధర్మం మీదే, నా ధర్మం నాదే' (అల్ కాఫిరూన్ :6) "ధర్మం విషయంలో నిర్బంధం కానీ, బలాత్కారం లేవు" (అల్ బఖర:256) "ప్రజలకు ఇస్లాం సందేశం గురించి తెలియజేయడం జరుగుతుంది. అయితేవారు ఇష్టమయితే ఇస్లాం స్వీకరించవచ్చు లేదా తిరస్కరించనూవచ్చు లేదా విధేయత చూపవచ్చు. అది వారి ఇష్టం."

- ఇస్లాం ఉగ్రవాదాన్నీ, వినాశనాన్ని ఖండిస్తుంది. ఇస్లామీయ జిహాద్ పట్ల వ్యతిరేకంగా దుష్ప్రచారం చేసేవారిది తెలియనితనమయినా కావాలి. లేదా ఇస్లాం పట్ల శత్రుత్వమైనా కావాలి. లేక వారి పాపాలను కప్పిపుచ్చు కోవడం కోసం ఇతరులపై బురదజల్లే ప్రయత్నమయినా అయి ఉండాలి.

## హజ్రత్ ముహమ్మద్ (స) నైతిక ప్రవర్తన

దివ్యఖుర్‌ఆన్ హజ్రత్ ముహమ్మద్ (స) నైతికత గురించి ఇలా పేర్కొంది:

"నిస్సందేహంగా నీవు మహోన్నత శీలం కలవాడవు." ఆయన(స) ఇలా అన్నారు: నన్ను ఉత్తమ నైతిక ప్రమాణాల పరిపూర్తికై పంపడం జరిగింది."

## 1. సత్యసంధుడు

హజ్రత్ ముహమ్మద్ (స) పూర్తిగా సత్యవంతులు. ఆయన తన జీవితంలో ఎన్నడూ అబద్ధమాడి ఎరుగరు. అందుకనే ఆయన దైవ ప్రవక్తగా నియమింప బడక పూర్వమే ఆయనను ప్రజలు సాధిఖ్-అమీన్ అనే బిరుదులతో సత్కరిం చారు. ఆయన ప్రవక్తగా ప్రకటించుకోగానే ఆయన బద్ధశత్రువులు సైతం ఆయనను అసత్యవాది అని చెప్పే ధైర్యం చేయలేకపోయారు. అబూజహల్ ఆయనకు బద్ధశత్రువు: "ఓ ముహమ్మద్ మేము మిమ్మల్ని అసత్యవాది అనడం లేదు. కాని మీరు ఏ గ్రంథం వినిపిస్తున్నారో అది అసత్యమైనదని అంటు న్నాము" అన్నాడు. అందువల్లనే ఖురాను గ్రంథం కూడా ఆయన దైవ దౌత్యానికి పూర్వపు పవిత్ర జీవితాన్ని ఈ విధంగా నకలు చేసింది: (యూనుస్ : 16) హజ్రత్ ముహమ్మద్ సల్లం మనసు, మాట, ఆచరణ ఒకే విధంగా

ఉండేవి. ఆయన ఏది చెప్పేవారో అదే చేసేవారు. ఏది చేసేవారో అదే చెప్పే వారు, ఆయన ప్రభోదించిన విషయాలను ముందు ఆయన ఆచరించేవారు. ఏ చెడుల గురించి చెప్పేవారో వాటికి ఆయన దూరంగా ఉండేవారు. మీరు మీపై సత్యాన్ని తప్పనిసరి చేసుకోండి. అసత్యానికి దూరంగా ఉండండి. పరాచికానికి, దాటివేయడానికి అసత్యం చెప్పడం కూడా అసమ్మతమనేవారు. (బుఖారి, ముస్లిం, అల్ఆదాబ్, అల్ముఫ్రద్) ఆయన వ్యక్తిగత జీవితానికి, సామాజిక జీవితానికి ఎలాంటి వ్యత్యాసం ఉండేదికాదు. ఆయన జీవితమంతా ప్రజలముందు అద్దంలా ఉండేది. ఆయన తన కోసం, జాతికోసం అసత్యం చెప్పనప్పుడు అల్లాహ్ పేరుతో అసత్యం చెపుతారని ఎలా ఆశించగలం.! 'అల్లాహ్' ఆయనను ప్రవక్తగా చేసి ఆయనపై ఖుర్ఆన్ను అవతరింప జేశాడు. ఆ ఖుర్ఆన్ ఆయన గురించి ఇలా చెపుతోంది:

"ఆయన తన ఇష్టానుసారం చెప్పడం లేదుగాని ఆయనపై 'వహి'[9] (దైవవాణి) అవతరిస్తోంది. మనిషి ప్రవర్తన అతని ముఖకవళికలపై కనిపిస్తూ ఉంటుంది. ఆ కారణంగానే ఏ వ్యక్తి అయినా ఆయనను మొదటిసారి చూశాడంటే హృదయాంత రాళలను నుండి: దైవసాక్షిగా ఈ ముఖవర్చస్సు ఒక అసత్యవాదిది కాదు, అని పలికేవాడు. (సీరతున్నబి)

## 2. మృదు స్వభావం - దయార్ద్రహృదయం

హ|జత్ ముహమ్మద్ (స) ఒక విశాలమైన దృక్పథం, దయగల హృదయం గలవారు. ఆయన గనక కఠిన హృదయుడయితే తన ఉద్యమంలో ఎన్నడూ విజయం సాధించేవారు కాదు. దివ్యఖుర్ఆన్లో ఇలా ఉంది:

'(ఓ ప్రవక్తా), అల్లాహ్ యొక్క అనంత కరుణ వల్లనే నీవు వారిపట్ల మృదు స్వభావుడవు అయ్యావు. నీవేగనక కర్కశుడవు, కఠిన హృదయుడవు అయినట్లయితే వారందరూ నీ చుట్టుపక్కల నుండి దూరంగా పోయేవారు." (ఆలి ఇమ్రాన్ : 159) ఖుర్ఆన్ ఆయనకు రవూఫుర్రహీం అనీ, రహ్మతుల్లిల్లాలమీన్ అనీ బిరుదులనిచ్చింది. (అత్తౌబ: 128, అంబియా,

107). స్వయంగా ఆయన కూడా ఇలా అన్నారు: "ఎవరు మెతకవైఖరి అవలంబించలేదో అతడు అన్ని రకాల మేళ్ళకు దూరమయ్యాడు" (ముస్లిం). ఆ కారణంవల్లనే ఏ వ్యక్తి అయినా ఆయనతో ఒక్కసారిగనక కలిసాడంటే చాలు ఆయనకు దాసోహమైపోయేవాడు. హజ్రత్ జైద్ ఆయన నౌకరుగా ఉండేవాడు. ఆ విషయం దాదాపు ఇరవై ఏళ్ళ తరువాత తండ్రికి తెలిస్తే ఆయనను తీసుకెళదామని మక్కాకు వచ్చాడు. కాని హజ్రత్ జైద్ మాత్రం ఆయన(స)ను విడిచి తండ్రితో వెళ్ళడానికి సిద్ధపడలేదు. అదే విధంగా హజ్రత్ అనస్ (రజి) పది సంవత్సరాలు ఆయన(స)కు సేవ చేశారు. ఆయన అంటారు: మహనీయ (స) నన్ను ఎన్నడూ కొట్టలేదు. కోపగించుకోనూ లేదు. గద్దించనూ లేదు. అలా ఎందుకు చేశావ్ ఇలా ఎందుకు చేయలేదు? అని కూడా ఆయన (స) అనలేదు. ఎంతో క్షమాగుణంతో మెదిలేవారు. (సీరతున్నబి). ఈ సాక్ష్యం ఆయన వ్యక్తిగత జీవితాన్ని ఎరిగినవారి సాక్ష్యం. బూటకపు మనిషి ప్రైవేట్ జీవితం, సాముదాయిక జీవితం వేరుగావేరుగా ఉంటుంది. కాని మహనీయ(స) జీవితం అలాంటికాదు. ఆయన(స)తో ఎవరయినా అమర్యాదగా ప్రవర్తిస్తే ఆయన క్షమా గుణం కలిగి ప్రవర్తించేవారు. అంతేకాదు వారికి ఉపకారం కూడా చేసేవారు. ఆయన (స) అన్నారు: "ఇతరులపై దయచూపని వారిపై అల్లాహ్ దయచూపడు" అని (మిష్కాత్). ఆయన (స) బోధనలలో మానవులపట్లనే కాదు, జంతువులతో సైతం దయతో ప్రవర్తించాలని బోధించారు. ఆయన (స) ఎన్నడూ ఎవరితో తన వ్యక్తిగత వ్యవహారాలలో ప్రతీకారం తీర్చుకోలేదు. (సీరతున్నబి) ఆ గుణమే ఆయనను నిలువెల్లా కారుణ్యంలో ముంచివేసింది. మక్కావాసులు ఆయన(స)ను ఎగతాళి చేసేవారు. కవిఅని, పిచ్చివాడని, మంత్రగాడని అనేవారు. ఆయన(స)ను అన్ని రకాలుగా వేధించారు. దారిలో ముళ్ళు పరిచేవారు. ఆయనపై అశుద్ధ పదార్థాలు వేసేవారు. "తాయెఫ్" నగరవాసులు ఆయన(స)ను రాళ్ళతో కొట్టి శరీరమంతా రక్తసిక్తం చేశారు. కఠినమైన మాటలతో మనసును గాయపరిచారు. మక్కావాసులు హిజ్రత్ నాటి రాత్రి ఆయన(స) ఇంటిని చుట్టుముట్టి ఆయన (స)ను అంతం చేయడానికి కుట్రపన్నారు. హిజ్రత్ తరువాత యుద్ధాలు చేశారు. ఆయనపై

హత్యాయత్నం చేశారు. యుద్ధంలో ఆయన బంధువు కాలేయాన్ని నమిలారు. మక్కా విజయం నాడు శత్రువులందరూ ఆయన ముందు తలలు వంచుకొని నిలుచున్నారు. ఆయనే తలచుకుంటే రక్తం ఏరులయిపారేది. కాని ఆయన(స) వారిని "మీతో నేను ఎలా ప్రవర్తిస్తానని అనుకుంటున్నారు. అని అడిగారు. దానికి వారంతా "మీరు దయచూపే సోదరునిగా ప్రవర్తిస్తారని ఆశిస్తున్నాము" అన్నారు. ఆయన సల్లం ఇలా అన్నారు:

"ఈనాడు మీపై ఎలాంటి నిర్బంధం లేదు. వెళ్ళండి. మీరంతా స్వతంత్రులు" ఈ ప్రవర్తన ఒక మామూలు వ్యక్తి ప్రవర్తన కాదు. అందుకే ఆయన గౌరవం ఔన్నత్యం మానవులందరిలో అత్యున్నతమయినవి.

## 3. ధనత్యాగం

మహాప్రవక్త (స) దైవప్రవక్తగా ఎన్నుకోబడకముందు అంతర్జాతీయ వాణిజ్యం చేసేవారు. ఆయన సతీమణి ఒక సంపన్నురాలు. ఆమె స్వయంగా పెద్ద వ్యాపారి. కాని ఆయన(స) దైవప్రవక్తగా ఎన్నుకోబడిన తరువాత ఆమె తన సంపదనంతా ఇస్లాం ప్రచారం కోసం ఖర్చు చేశారు. చివరికి ఆయనకు తాయెఫ్ నగరానికి కాలినడకన వెళ్ళవలసివచ్చింది. ఏ వాహనమూ లేకుండా పోయింది. మదీనాకు వలసపోయే సమయంలో ఖర్చులన్నీ హజ్రత్ అబూబక్ర్ (రజి) భరించారు. ఆయన (స) వద్దకు సంపద వచ్చినప్పుడు ఖర్చులవరకే తీసుకుని మిగతాది పేదలకు దానం చేసేవారు. ఆయన (స) చేయి చాపేవానికి ఎన్నడూ ఉత్తచేతులతో పంపలేదు (సీరతున్నబి). పై చేయి కింది చేయికన్నా మేలయినది అని ఆయన(స) అనేవారు (తిర్మిజి). మక్కా విజయం తరువాత జరిగిన హునైన్, యుద్ధాలలో వేలాది గొర్రెలు, ఒంటెలు లెక్కలేనంత సంపద సమర సొత్తుగా లభించింది. వాటిని ఆయన(స) అక్కడికక్కడే నవ ముస్లిము లకు పంచివేశారు (సీరతున్నబి). ఆయన (స) మరణించేనాటికి ఆయన వద్ద ఎలాంటి సంపదా మిగలలేదు. ఆరు దిరహములు ఉండగా వాటిని కూడా ఆయన (స) మరణశయ్యపై ఉండగానే సతీమణి దానం చేసివేశారు.

ఆయన (స) సతీమణి హజ్రత్ ఆయిషా (రజి) పొరుగు వారి వద్ద నూనె అరువు తెచ్చి, దీపం వెలిగించింది. కొన్ని కిలోల ధాన్యానికి ఆయన కవచం ఒక యూదుని వద్ద తాకట్టులో ఉంది (సీరతున్నబి). దేవుని ప్రవక్త ప్రపంచంలో ఉండి కూడా ప్రపంచ పిపాస లేదని ఈ విషయాల వల్ల తెలుస్తోంది. ఇవే దైవప్రవక్తలో ఉన్న ప్రత్యేక గుణాలు.

## 4. దైవారాధకుడు

హజ్రత్ ముహమ్మద్ (స) దైవదౌత్యానికి పూర్వం తన సృష్టికర్త అన్వేషణలో ఉండేవారు. ఆ చింతనలోనే హిరా గుహలో రాత్రింబవళ్ళు గడిపేవారు. వాస్తవం ఆయన ముందు తేటతెల్లంకాగానే ఆ సృష్టికర్తను జ్ఞాపకం చేయడం, ఆయన ప్రేమలో లీనమవడం ఇంకా అధికమయ్యింది. ఆయన సల్లం నిరంతరం అల్లాహ్‌ను స్మరించేవారు. ఎల్లప్పుడు ఆయన సుబ్‌హానల్లాహ్, అల్‌హమ్దులిల్లాహ్, అల్లాహుఅక్బర్ వచనాలను పలుకుతూ ఉండేవారు. అల్లాహ్ ముందు క్షమాపణ వేడుకునేవారు. దైవప్రసన్నత కోసం ఫర్జ్ (విధి) నమాజ్‌లే కాక నఫిల్ (ఆదనపు) నమాజులు కూడా చేసేవారు. రాత్రులలోని చాలా భాగం తహజ్జుద్ నమాజులోనూ, దివ్యఖుర్ఆన్ పారాయణంలోనూ గడిపేవారు. నమాజులో నిలవడం వల్ల ఆయన కాళ్ళు వాచిపోయేవి (సీరతున్నబి).

"ప్రవక్తా! మీరు అల్లాహ్‌కు ప్రీతిపాత్రులు కదా! మీరు అల్లాహ్ అనుగ్రహం పొందినవారు కదా! అయినా మరి మీరు ఇంతగా ఆరాధన ఎందుకు చేస్తారు? అని ప్రజలు ప్రశ్నించినప్పుడు ఆయన ఇలా సమాధానం ఇచ్చారు: (ముజమ్మిల్: 20;)

"నేను కృతజ్ఞతలు చెల్లించే దాసుడను కాకూడదా" (సీరతున్నబి). విధిగా నిర్ణయించిన ఉపవాసాలే కాక నఫిల్ (అదనంగా) ఉపవాసాలు కూడా అధికంగా పాటించేవారు. అసలయితే అల్లాహ్, దాసుల అరాధన ఎంతమాత్రం అక్కరలేనివాడు కాని, దాసుడే ఆరాధన ద్వారా అల్లాహ్ ప్రసన్నతను పొందుతాడు. దాని ద్వారా ఆయనతో తన సంబంధాన్ని పటిష్టపరచుకుంటాడు. తన స్వభావాన్ని పవిత్రం చేసుకుంటాడు. హజ్రత్

ముహమ్మద్ సల్లం తన అనుచర సమాజం కోసం ఆదర్శంగా నిలవాల్సి ఉండింది. ఆయన సల్లం చెప్పారు: ప్రపంచంలో ఉంటూ, ప్రజల హక్కులను నెరవేరుస్తూ ఏ విధంగా అల్లాహ్ సామిప్యాన్ని పొందవచ్చో ఆయన ఈ విధంగా తెలిపారు: అల్లాహ్ ఆరాధన కోసం సన్యాసత్వం అవసరంలేదంటూ ఆయన సల్లం ఇలా ప్రార్థించే వారు.

"ఓ అల్లాహ్ నన్ను నీ స్మరణలో లీనమయ్యేవానిగా, కృతజ్ఞతలు తెలిపే వానిగా చెయ్యి, ఉన్నతమైన ఆరాధన చేయడానికి అనుగ్రహించు." (అబూదావూద్)

## 5. నిరాడంబరత - పరలోక చింతన

హజ్రత్ ముహమ్మద్ (స) పరిశుద్ధతను ఇష్టపడేవారు. ఆయన(స) నిరాడంబరంగా ఉండేవారు. అతుకులువేసిన బట్టలు, తొడగడానికి న్యూనతగా భావించేవారు కాదు. బట్టలు పరిశ్రుభంగా ఉండేవి. ధర్మసమ్మతమైన ఆహారమే భుజించేవారు. ఎన్నడూ దేనిలోనూ లోపం వెతికేవారు కాదు. అందరితో కలసి భుజించడాన్ని ఇష్టపడేవారు. చాలా సార్లు ఆకలి దప్పులకు తాళలేక కడుపుపై రాయికట్టుకునేవారు. సమావేశంలో అందరితో పాటు కూర్చునేవారు. గొంతెత్తి మాట్లాడేవారు కాదు. ఎవరి, మనసూ నొప్పించేవారు కాదు. ఉన్న దున్నట్లు మాట్లాడేవారు. ప్రగల్భాలు పలకడం, గొప్పలు చెప్పకోవడం ఆయనకు నచ్చేవికావు. హిజ్రత్ చేసిన తరువాత మదీనా ప్రజలు ఆయనకు దాసోహం అన్నారు. తనను గౌరవించడంలో అతిగా ప్రవర్తించడాన్ని ఇష్టపడేవారు కాదు. తనకోసం ప్రత్యేక బిరుదులతో పిలువడం కూడా ఆయనకు ఇష్టం ఉండేదికాదు. తన కోసం లేచి నిలబడడం, వంగివంగి సలాములు కొట్టడం కూడా ఆయనకు నచ్చేదికాదు. బజారుల్లో వెళ్ళినప్పుడు ఆయన(స) వెంట అంగరక్షకులుగాని, పక్కకు జరగండి. అని అనేవారు కూడా ఉండేవారు కాదు. ఆయన మేడలో నివసించలేదు. మస్జిదె నబవీని ఆనుకొని మట్టితో కట్టిన గోడలపై ఖర్జూరపు ఆకులతో కప్పు వేసిన గదులు ఉండేవి. (సీరతున్నబి). ఒకసారి హజ్రత్ ఉమర్ (రజి) ఆయనను కలవడానికి వచ్చి ఇల్లంతా

ఒకసారి కలియజూశారు. ఎలాంటి సామగ్రి కనిపించలేదు. ఒక వైపు నీళ్ళతో నిండిన తిత్తి వేలాడుతూ ఉంది. మరొకవైపు కొన్ని దినుసులు పడి ఉన్నాయి. ఆయన ఖర్జూరపు నారతో చేసిన చాపపై పడుకుని ఉన్నారు. ఆ దృశ్యాన్ని చూడగానే హజ్రత్ ఉమర్(రజి) కళ్ళలో నీళ్ళు ఉబికి వచ్చాయి. అది చూసి మహనీయ సల్లం "నాకు ప్రపంచంతో ఏం పని ఒక ప్రయాణికుడు కొద్ది సేపటి కోసం ఆగి చెట్టు నీడలో సేదతీర్చుకుని వెళ్ళి పోతాడు. నా ఉదాహరణ కూడా అలాంటిదే" అని అన్నారు ఉమర్ (రజి)తో (సీరతున్నబి). ఆయన సల్లం ఇంకా ఇలా అన్నారు. "ఏ వ్యక్తి ప్రపంచాన్ని ప్రేమిస్తాడో అతడు పరలోకాన్ని నాశనం చేసుకుంటాడు, ఏ వ్యక్తికి పరలోకం ప్రీతికరమయినదో అతడు ప్రపంచాన్ని పట్టించుకోడు. అయితే, ఓ ప్రజలారా! మీరు శాశ్వతంగా ఉండే జీవితం కోసం అశాశ్వతమైన జీవితాన్ని పణంగా పెట్టండి" అన్నారు. (మిష్కాత్) మహానీయ ముహమ్మద్ (స) జీవితంలో రాజులవలె, నవాబులవలె వైభవం, ఆడంబరాలు ఉండేవికావు. అంతరంగంలోనూ, బాహ్యంలోను స్వాభావికమైన నిరాడంబరతే కానవచ్చేది. ఈ నిరాడంబరత, ప్రపంచాన్ని పరలోకంపై ప్రాధాన్యం ఇవ్వడంవల్ల కలిగింది. ఈ గుణ గణాలు అల్లాహ్‌కు చెందిన ప్రత్యేక దాసులలోనే ఉంటాయి.

## 6. వ్యవహారాలు

హజ్రత్ ముహమ్మద్ (స) అందరితోపాటు సాధారణ సామాజిక జీవితం గడిపేవారు. ప్రజలతో కలిసేవారు. సామాజిక జీవితంలో ఇచ్చిపుచ్చుకోవడం ఇంకా విభిన్న రకాల వ్యవహారాలు ఉంటాయి. ఆ వ్యవహారాలలో ఆయన ఖరాఖండిగా ఉండేవారు. అమానతు దారుడు, నీతిమంతుడు కూడా. ఆశ్చర్య కరమయిన విషయం ఏమిటంటే ప్రజలు ఆయన (స)తో శత్రుత్వం వహిస్తూ కూడా తమ సొత్తును ఆయన వద్దనే అమానతుగా పెట్టేవారు. హిజ్రత్ చేసిననాటి రాత్రి ఆయన సల్లంను అంతం చేయడానికి వచ్చినవారి సొమ్ము కూడా ఆయన (స) దగ్గరే ఉంది. హజ్రత్ అలీ రజిని తన ప్రతినిధిగా చేసి ఇదిగో ఇవి ఫలానా ఫలానా వార సొమ్ము (సీరతున్నబి). ఎవరి సొమ్ము

వారికి ఇచ్చి వేయండని చెప్పారు. ఆ సమయంలో ఆయన వద్ద చిల్లిగవ్వ కూడా లేదు. హిజ్రత్ ఖర్చులన్నీ హజ్రత్ అబూబక్ర్ (రజి)నే భరించకున్నారు. ఇలా ఒక ప్రవక్త మాత్రమే వ్యవహరించగలుగుతాడు. ఆయన ఎవరితోనైనా వాగ్దానం చేస్తే దానిని నిర్వర్తించేవారు. హిజ్రత్ 6వ ఏట మక్కావాసులతో చేసుకున్న ఒప్పందంలో "ఒక వ్యక్తి మక్కా నుండి మదీనా వచ్చినట్లయితే అతడిని తిరిగి మాకు అప్పగించాలి" అనే మాట ఇంకా వ్రాయబడలేదు. ఆ సందర్భంలోనే దౌర్జన్యానికి గురయి, సంకెళ్ళతో బంధింపబడి హజ్రత్ అబూజందల్ (రజి) అక్కడికి చేరుకున్నారు. ఆయన మహనీయ (స)తో పాటు మదీనా వెళ్ళదలిచారు. కాని మక్కావాసులు: "ఒప్పందం జరిగింది గనక మీరు అబూజందల్‌ను తీసుకువెళ్ళ లేర"ని అభ్యంతరం చెప్పారు. అందుకు ఆయన(స) మౌనంగా ఉండిపోయారు. ఆ తరువాత, "అల్లాహ్ అతని కోసం ఏదో మార్గం చూపకపోడు" అని అన్నారు సల్లల్లాహు అలైహి వసల్లం. పధ్నాలుగు వందల మంది అనుచరులు ఒక్క సంజ్ఞపై ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా ఉన్నారు. అయినా ఆయన (స) ఒప్పందానికే ప్రాధాన్యం ఇచ్చారు. ఆయన (స) ఎవరివద్దనైనా ఏ వస్తువయినా కొంటే దాని వెల చెల్లించేవారు. తన వ్యక్తిత్వాన్ని అనవసరంగా ఉపయోగించి దుకాణ దారుడిని కష్టపెట్టేవారు కాదు. తన హక్కును కాదని ఇతర హక్కుదారులను వారి హక్కు కంటే అధికంగానే ఇచ్చేవారు. (సీరతున్నబి) ఆయన చేసిన వ్యవహారాలు మానవ జాతికి ఆదర్శమైనవి, తిరుగులేనివి.

## 7. సందేశ ప్రచారంకోసం తహతహ

ఆయన (స) పూర్తిజీవితంపై సందేశ ప్రచారం ఆవరించి ఉండేది. మానవు లందరినీ సన్మార్గంపై తేవడానికి తల్లిడిల్లిపోయేవారు. ఆయన తహతహను దివ్యఖుర్‌ఆన్ ఇలా ఉటంకించింది:

"....." (అష్ షుఅరా: 3) ఆయన (స) కూడా స్వయంగా ఇలా ప్రవచిం చారు: 'ఒక వ్యక్తి వెలుతురు కోసం మంట రాజేశాడు. పురుగులు అందులోపడి కాలిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి. అతడు వాటిని మంటల్లో పడకుండా

ప్రయత్నిస్తూ ఉన్నాడు. కాని ఆ పురుగులు అతడిని లెక్క చేయడం లేదు. నా ఉదాహరణ కూడా ఆ వ్యక్తివంటి వాడిదే. నేను మీ నడుము పట్టిపట్టి ఆపు తున్నాను. మీరేమో అగ్నిలో పడడానికి సిద్ధంగా ఉన్నారు. (మిష్కాత్) ఈ విషయం వల్ల ఆయన(స) మానవాళిని నరకాగ్ని నుండి రక్షించడానికి ఎంతగా తపించేవారో అర్థమవుతూ ఉంది. ఆయన (స) మేలు చేసేవారికి స్వర్గం శుభవార్తను, కీడు చేసేవారికి నరకం దుర్వార్తను వినిపించేవారు. ఆయన (స) వివేకంతో సుబోధనతో సందేశం వినిపించేవారు. సంబోధితుని స్థాయిని పసిగట్టి తన మాటను ముక్తసరిగా వినిపించేవారు. వాగ్వివాదానికి దూరంగా ఉండేవారు. దివ్యఖుర్ఆన్ వినిపించి ప్రచారం చేయడమే ఆయన ఆనవాయితి. ఆయనతో కటువుగా వ్యవహరించే వారితో ఆయన నమ్రతగా వ్యవహరించే వారు. అతిథిని గౌరవించేవారు. నిరాశ్రయులకు ఆశ్రయమిచ్చే వారు. అవస రార్థుల అవసరాలను తీర్చేవారు. వ్యాధిగ్రస్తులను పరామర్శించే వారు. దుః ఖంతో ఉన్నవారిని ఓదార్చేవారు (సీరతున్నబి). ఆయన అత్యున్నత మైన ప్రవర్తన ఆయన సందేశానికి ఎంతో సహకారిగా ఉపయోగపడింది. ధనిక, పేద, స్థానికుడు, పరదేశీ యుడు, స్వతంత్రుడు, బానిస అనే తారతమ్యం లేకుండా అందరినీ కలిసేవారు. వారికి దైవసందేశం వినిపించేవారు. "ఈ విషయంలో ఆయన తన విశ్రాంతిని కూడా లెక్క చేసేవారు కాదు. సందేశం వినిపించడంలో ఒక్క క్షణం కూడా వృథాచేసేవారు కాదు. ఆయన (స) తన గవర్నర్‌లతో: "చూడండి ప్రజలకు శుభవార్త ఇచ్చేవారుగా మెలగండి ధర్మంపట్ల ఏవగింపు కలిగేలా ప్రవర్తించకండి. వారికోసం సౌలభ్యాలను కలుగజేయండి. ఆపదలు కలుగ జేయకండి." అని అనేవారు(సీరతున్నబి). ఒకసారి ఆయన ముందు ఖుర్ఆన్ పఠించబడింది. అందులో ప్రవక్త పదవి బాధ్యత గురించి ప్రస్తావించడం జరిగింది. (అన్నిసా:91) అది విని ఆయన కన్నీరు మున్నీరుగా విలపించారు. దివ్యఖుర్ఆన్ ఇలా అంటోంది. "అల్లాహ్ వైపునకు పిలిచి, మంచి పనులు చేసి నేను ముస్లిం అని ప్రకటించే వ్యక్తి మాటకంటే మంచి మాట మరెవరిది కాగలదు." (హామీమ్ సజ్దా : 33) హజ్రత్ ముహమ్మద్(స) 23 సంవత్సరాలు ధర్మప్రచారంలో కృషి చేశారు. ఆయన (స) చివరికాలంలో

అంతిమ హజ్ సందర్భంగా ప్రసంగిస్తూ "ప్రజలారా! నేను అల్లాహ్ ధర్మాన్ని మీ దాకా చేరవేశానా?" అని అడిగారు. వాళ్ళంతా: "అవును మీరు ధర్మం ప్రచారం చేశారు. మీ హక్కును మీరు నిర్వర్తించారు. అల్లాహ్ అమానతును సంపూర్ణంగా ప్రజలకు చేరవేశారు. ముస్లిం సమాజాన్ని తీర్చిదిద్దడంలో మీరు కొదవేమీ చేయలేదు" అని అన్నారు. అప్పుడు ఆయన సల్లం ఆకాశంవైపు చూపుడు వేలు ఎత్తి 'అల్లాహుమ్మ అష్హదు, అల్లాహుమ్మ అష్హదు' "ఓ అల్లాహ్ వీరంటున్న దానికి నీవు సాక్షిగా ఉండు"; **ఫల్యుబల్లిగుష్షహీదుల్ గైయిబ** అని మళ్ళీ అన్నారు: "ఇక్కడ హాజరుగా ఉన్నవారు, ఇక్కడ లేనివారికి (ఇస్లాం) సందేశాన్ని వినిపించండి" అని హితవు చేశారు. (సీరతున్నబి)

## ఆయన నైతిక స్వభావం గురించి హజ్రత్ అయిషా (రజి) సాక్ష్యం

విశ్వాసుల మాత హజ్రత్ అయిషా (రజి) ఆయన (స) అలవాట్లగురించి చెపుతూ: ఆయనకు ఎవరి చెడు గురించి చెప్పే అలవాటు లేదు. చెడుకు బదులుగా చెడు చేసేవారు కాదు. పైగా ఆయన క్షమించేవారు. సులభమయిన రీతిని అవలంబించేవారు. ఆయన తన స్వంత విషయంలో ఎవరితో ప్రతీకారం తీర్చుకోలేదు. ఏ ముస్లింను కూడా శపించలేదు. సమ్మతమయిన ఫిర్యాదు వస్తే దానిని రద్దుపరచలేదు. తన ఇంటివారందరితో సంతోషంగా గడిపేవారు. స్నేహితులను గౌరవించేవారు. ఎదుటివారు తన మాటలను జ్ఞాపకం పెట్టుకోవ డానికి ఆగి ఆగి సంభాషించేవారు. ఒకసారి ఎవరో హజ్రత్ ఆయిషా (రజి)ను అడిగారు: దైవప్రవక్త (స) స్వభావం ఎలా ఉండేది? అని. ఆమె: కాన ఖుల్ఖుహు ఖుర్ఆన్. "ఆయన పూర్తి స్వభావంలో ఖుర్ఆన్ కానవచ్చేది." అనేవారు. అంటే దివ్యఖుర్ఆన్‌లో ఆదేశించిన నైతికతలకు ఆయనే ఆదర్శం.

● హజ్రత్ అలీ (రజి) అంటారు: మహనీయ(స) "ఎంతో నిజాయితీ పరులు. మెతకవైఖరికలిగిన, శుభవంతమయిన తోడు ఆయనది. ఎంతో ఉదారతగలవారు. ఏ చెడు మాటా పలికేవారు కాదు. అవసరానికి మించి మాట్లాడేవారుకాదు. ఫలవంతమయిన సంభాషణే చేసేవారు. మధ్యలో ఎవరి

మాటనూ ఆటంకపరిచేవారు కాదు. తనను గురించి పొగడడం ఇష్టం ఉండేది కాదు. అనుచరుల మాట శ్రద్ధగా వినేవారు. (సీరతున్నబి). ఇవి ఆయన (స) గారి నైతిక ప్రవర్తనలోని విషయాలు. వీటి వల్ల ఆయన ఔన్నత్యం గురించి అర్థం చేసుకోవచ్చు. హజ్రత్ ముహమ్మద్ (స) ప్రపంచంలోనే గొప్పవారు. నైతిక ప్రబోధనాన్ని ఆయన(స) తన మాట ద్వారా ఆచరణ ద్వారా నిరూపించి చూపారు. అందువల్లనే ఆయన గురించి ఖుర్‌ఆన్‌లో : వాస్తవంగానే అల్లాహ్ ప్రవక్తల్లో మీకు ఒక మంచి ఆదర్శం ఉంది." (అల్ అహ్‌జాబ్:21) ఆయన సల్లం అన్నారు. "మీలో అందరికంటే మంచివారు ఉత్తమ నైతికతను కలిగి ఉన్నవారే." (ముస్లిం)

## హజ్రత్ ముహమ్మద్ (స) సందేశం మానవాళి పేర

హజ్రత్ ముహమ్మద్ (స) సందేశం, భేదభావాలు ప్రాంత, భాష, రంగు, వంశం, తెగ అనే తారతమ్యం లేకుండా ప్రపంచవాసులందరికోసం ఇవ్వబడింది. పక్షపాతం, గౌరవోన్నతులన్నింటినీ మినహాయించి ఆయన మానవులను మానవులుగా సంబో ధించారు. హోదా గౌరవాల అహంభావాల కారణంగానే ప్రపంచంలో మానవ రక్తం ఏరులయి పారింది. (వర్ణాశ్రమ భావన మానవులను విభిన్న వర్గాలుగా విభజిస్తోంది. ఇస్రాయీలీయులు, జర్మన్ల వద్ద హోదా గౌరవాల ఔన్నత్యానికి ప్రమాణాలు. నల్లవారి, తెల్లవారి మధ్య భేదాలు, దేశాల జాతుల, వ్యత్యాసాలపై జరిగిన దౌర్జన్యాలను ప్రపంచం చూసింది.)

● మానవులంతా ఒక్కటే అని, సమానమని దివ్యఖుర్‌ఆన్ బోధిస్తోంది. హజ్రత్ ముహమ్మద్ (స)కు ఈ సందేశం ఇచ్చి ప్రపంచవాసులందరి కోసం పంపించాడు అల్లాహ్. దైవగ్రంథంలో ఇలా అన్నాడు-

'మేము నిన్ను సర్వమానవులకు శుభవార్తను ఇచ్చేవాడుగా, హెచ్చరిక చేసేవాడుగా నియమించి పంపాము. కాని చాలామంది మానవులు దీనిని ఎరుగరు.' (సబా: 28)

ఒక హదీసులో ఆయన సల్లం ఇలా ప్రవచించారు: తను ప్రతి నల్లవాని కోసం ప్రతి తెల్లవానికోసం ప్రభవింపజేయబడ్డారని అన్నారు. (ముస్నద్ అహ్మద్) అల్లాహ్, ప్రవక్త దృష్టిలో ప్రపంచప్రజలందరూ ఒక్కటే. అందరూ ఆదం, హవ్వాల సంతానమే అని అల్లాహ్ ఇలా అంటాడు:

"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరి కంటే ఎక్కువ భయభక్తులు గలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు" (అల్‌హుజురాత్ : 13)

● మహోనీయ సల్లం అంతిమ హజ్ సందర్భంగా చేసిన ప్రసంగంలో ఇలా ప్రకటించారు. ప్రజాలారా జాగ్రత్త! మీ అందరి దేవుడు ఒక్కడే. ఒక అరబ్బుపై అరబ్బేతరునికి, అరబ్బేతరునిపై అరబ్బుకు, తెల్లవాడిపై, నల్లవాడికి, నల్లవానికి తెల్లవానికి ఎలాంటి ఆధిపత్యం లేదు. అల్లాహ్ వద్ద గౌరవనీయుడు మీ అందరిలో భయభక్తులు గలవాడే.

హజ్రత్ ముహమ్మద్ (స) మానవ సమానత్వం గురించి ఇచ్చిన సందేశం ఒక సిద్ధాంతమేకాదు, దానిని ఆయన కొద్దికాలంలో ఆచరించి చూపారు కూడా. ప్రతి రోజు ఐదుపూటల నమాజులో ఆ దృశ్యం కనిపిస్తూ ఉంటుంది. అక్కడ ధనికుడు, పేదవాడు, యజమాని, నౌకరు, జాతి, మతం, అంటరాని తనం అనే వ్యత్యాసం ఏదీ లేకుండా ఒకే పంక్తిలో ఒకే దేవుని ముందు నిలవడం, సాష్టాంగపడడం వగైరా దృశ్యాలు హజ్‌యాత్రలో కూడా కానవస్తూ ఉంటాయి. దైవదాసులు తూర్పు, పడమర, ఉత్తర దక్షిణాల నుండి ఏక దైవారాధన కేంద్రం వైపునకు పరుగుపరుగున చేరుకుంటారు. వారి రంగూ, రూపం, భాష, వంశం, జాతి, దేశం, ప్రాంతం, అన్ని వేరువేరుగా ఉంటాయి., వారిలో అరబ్బులూ ఉన్నారు. అరబ్బేతరులూ ఉన్నారు. నల్లవారూ ఉన్నారు, తెల్లవారూ ఉన్నారు. అయినా వారంతా ఒకే విధమయిన దుస్తుల (ఎహ్‌రాం)లో ఉండి ఒకే వచనం, లబ్బైక్ అల్లాహుమ్మ లబ్బైక్ అని వల్లిస్తూ హజ్ విధులను

నిర్వర్తిస్తారు. ఆ హజ్ సందర్భంగా మానవులంతా ఒక్కటే అనే దృశ్యాన్ని ఈనాడు (ప్రపంచంలోని (ప్రతి వ్యక్తీ టీవి ద్వారా చూస్తూ ఉన్నాడు.

"మీ సంఘం వాస్తవానికి ఒకే సంఘం, నేను మీ (ప్రభువును. ఇక మీరు నన్నే ఆరాధించండి." (అంబియా: 92) మానవ సమానత్వం కేవలం ఇస్లాంలో మా(త్రమే ఉందనేది కాదనలేని వాస్తవం. ఐక్యరాజ్యసమితిలో కేవలం తీర్మానాలు మా(త్రమే ఆమోదించబడతాయి. కాని ఆచరణ మా(త్రం దానికి (ప్రతికూలంగా ఉంటుంది.

## 1. దేవుని ఏకత్వం

హ(జత్ ముహమ్మద్(స)సందేశ (ప్రచారం (ప్రారంభించినప్పుడు (ప్రపంచంలో చాలా మతాలు ఉండేవి. అయితే వారి బోధనలు కలగాపులగమయ్యాయి. అదే విధంగా రాజకీయ, ఆర్థిక, సామాజిక సమస్యలు, దురాచారాలు కూడా ఉండేవి. (ప్ర(ప్రథమంగా (ప్రవక్త(స) మనిషి విశ్వాస నమ్మకాలను తీర్చిదిద్దడంలో నిమగ్నమయ్యారు. ఆయన చెప్పింది ఒకే వచనం అది:

**ఖూలూ లాఇలాహ ఇల్లల్లాహ్ తుఫ్లిహూ;** "(ప్రజలారా అల్లాహ్ తప్ప మరొక దేవుడు లేడని అనండి, సాఫల్యం పొందుతారు." అల్లాహ్ గురించి ఆయన (స) వివరంగా తెలియజేశారు.

● అల్లాహ్ (దేవుడు) (ఇద్దరు గాని, ముగ్గురు గాని, అసంఖ్యాకంగా గాని లేరు). ఆయన ఒకే ఒక్కడు. అవిభాజ్యుడు. ఎల్లప్పుడు ఉండేశక్తి గల వాడు, సజీవుడు. అన్ని కాలాలలో నిత్యనూతనంగా వెలుగొందుతున్నవాడు. ఆయన ఎవరికీ తం(డికాదు. కుమారుడు కాదు. ఆయనకు సమానులు ఎవరూ లేరు. ఆయన అలసట చెందనివాడు. కునుకు రానివాడు. నిద్దురపోనివాడు. నిరపేక్షాపరుడు. సమస్త సృష్టికి (సృజన) కర్త. పరిపోషకుడు. ఆయనే ఆహారం ఇచ్చేవాడు. ఆకాశాలలో భూమిలో ఉన్నవాటన్నింటికీ యజమాని. ఆయన సృష్టివ్యవస్థను వివేకంతో నడిపించేవాడు. అన్నీ ఆయన విధేయతకు లోబడి

ఉన్నాయి. అన్నింటిపై శక్తి గలవాడు. తాను కోరింది. చేసివేస్తాడు. ఆయన నిర్ణయాన్ని పర్యవేక్షించేవాడు ఎవరూ లేరు. ఆయనే గుప్తమయినవి, బహిరంగ మైనవి ఎరిగినవాడు. ఆయన కన్నుల సంజ్ఞలను మనసులోని మర్మాలను ఎరిగినవాడు. ఆయన జ్ఞానం అంతటా ఆవరించి ఉంది. ఆయన సూక్ష్మద్రష్ట. ఆయన ప్రతి దానిని, ప్రతి ప్రదేశాన్ని అన్ని సమయాలలోను ఒకేసారి చూడ గలుగుతాడు. ఆయనే వేడుకోలును మన్నించేవాడు. అవసరాలను తీర్చే వాడూను. లాభనష్టాల ఆధిపత్యం ఆయనకే ఉంది. గౌరవాగౌరవాలు, జీవితం- మరణం ఆయన చేతుల్లోనే ఉన్నాయి. (సూరెఇఖ్లాస్, అల్‌బఖర: 252, అల్అన్‌మ్: 73, అల్‌ఫుర్ఖాన్ : 2, ఫాతిర్ : 3, అజ్ జారియాత్:58, యూనుస్: 107, అల్‌హదీద్:5, అల్‌బురూజ్:16, అర్రాద్:41, ఆలిఇమ్రాన్:26, సబా:2-3, అల్అన్‌ఆమ్: 59, అల్‌ఫాతిహా:1, అల్‌ముల్క్:1, 13, 14, అల్‌ముమిన్ :60)

## 2. దివ్యఖుర్‌ఆన్‌లో భూమ్యాకాశాల సృష్టిరాశుల ద్వారా అల్లాహ్ ఏకత్వాన్ని నిరూపించడం

భూమీ ఆకాశాలను సృష్టించింది ఎవరు? వర్షం కురిపించి ఎండి, బీడువారిన భూమిని పచ్చని పొలాలుగా చేస్తున్నది ఎవరు? భూమిపై పర్వతా లను పేర్చింది ఎవరు? నదులను ప్రవహింపజేసేది ఎవరు? సముద్రాలలో ఓడలను నడిపించేది ఎవరు? తల్లి గర్భంలో బిడ్డ రూపాన్ని తయారు చేసేది ఎవరు? చూసే, వినే ఆలోచించే శక్తి సామర్థ్యాలను కలిగించింది ఎవరు? వేడుకోలును వినేవాడు, లాభనష్టాలను చేకూర్చేవాడు ఎవరు? వీటిన్నింటికి ఒకే ఒక్క సమాధానం అల్లాహ్! మరి ఆయనను వదిలేసి ఇతరులను దేవుళ్ళుగా ఎందుకు చేసుకోవాలి? అవి ఎలాంటి శక్తీ లేనివి. అయితే కొన్ని పేర్లను మాత్రం దేవుని కోసం ప్రజలు ప్రతిపాదించారు. (అన్‌నమ్ల్:60-64, అల్ వాఖీఅహ్: 57, యూనుస్:131-135 అన్‌ఆమ్ :46 అర్‌రూమ్: 40; అల్‌ఖసస్ : 72, సబా:22-23

- సర్వసృష్టికి ఆయన ఒక్కడే యజమాని. పరిపోషకుడు. ఆరాధనకు అర్హుడు. యజమాని, రాజ్యతంత్రజ్ఞుడు, అధిపతి, దైవత్వం, పాలనాధిపత్యం అధికారాలలో ఉండవలసిన గుణాలు ఆయనలో తప్ప ఇంకెవరిలోనూ రవ్వంత కూడా లేవు. అల్లాహ్ శక్తి సామర్థ్యాలలో, గుణగణాలలో, హక్కులలో, అధికారంలో మరొకరిని చేర్చడం, ఇస్లాంలో మహాపాపం. హజ్రత్ ముహమ్మద్ సల్లం ఏకేశ్వరోపాసనతోపాటు దైవత్వంలో మరొకరిని చేర్చడాన్ని, విగ్రహారాధన చేయడాన్ని నిరాధార మైనవిగా పేర్కొంటూ దైవవాణిని ఈ విధంగా తెలియజేశారు. "ప్రజలారా! ఒక ఉదహరణ ఇవ్వబడుతోంది. శ్రద్ధగా వినండి. సృష్టికర్తను వదలి మీరు ఏఏ దైవాలనయితే మొక్కుతున్నారో వాళ్ళంతా కలసి ఒక్క ఈగనయినా సృజించాలనుకుంటే సృజించలేరు. అంతేకాదు. ఈగ ఏదయినా పదార్థం తీసుకెళ్ళినా దానిని వారు విడిపించలేరు. సహాయం అర్థించేవారు బలహీనులే, ఎవరి సహాయం కోరుతున్నారో వారూ బల హీనులే. (అల్‌హజ్:73, అన్ కబూత్: 41, లుఖ్మాన్:13, అన్‌నిసా:47, 116, అల్‌మాయిద: 72, అల్‌అన్‌ఆమ్: 83-88, అజ్‌జుమర్:35).

- అల్లాహ్ ఒక జ్యోతి . అది ఉదహరించలేనిది. సృష్టికర్తను వదలి ఎవరెవరి నయితే ప్రజలు ఆరాధిస్తున్నారో వారికి దైవత్వంలో రవ్వంత భాగం కూడా లేదు. ఏ విగ్రహాలనయితే దైవత్వంలో భాగమని తలచి వాటికి పూజలు జరుపుతున్నారో వాటిలో ఏ శక్తీలేదు. అవి విననూలేవు, చూడనూ లేవు, మాట్లాడనూలేవు, దేనినయినా పట్టు కోనూలేవు, నడువనూలేవు కూడా. ఆహారం భుజించడం గానీ, పానీయాలు సేవించడంగాని లాభంచేకూర్చడంగాని, నష్టం కలిగించడం గాని వాటి అధీనంలో లేదు. వాటిని మీరు తయారు చేస్తారు. అవి ఏమీ తయారు చేయలేవు. మరి అలాంటి అవాస్తవమయిన వాటిని నిరాధారంగా పూజించడం అంటే అది తెలియనితనం అయినా కావాలి. లేదా నిరర్థ కమయినా అయి ఉండాలి.

- సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, భూమి ఆకాశం, నదులు, పర్వతాలు, చెట్లుచేమలు, జంతుజాలాలు వగైరాలన్నీ అల్లాహ్ సృష్టితాలే. వాటన్నింటిని అల్లాహ్ మానవుల సేవలో నిమగ్నం చేశాడు. మనిషికి అల్లాహ్ ఆలోచించే మేధస్సునిచ్చాడు. తాత తండ్రుల అంధానుసరణను వదలి దేవుని గురించి పరిశీలించి ఇబ్రాహీం (అలై) దేవుడు ఒక్కడేనని ప్రకటించిన విధంగా ప్రకటించాలి.

  *(అన్ నూర్:35, అష్ షూరా: 11, షుఅర :69 నుండి 82, అంబియా: 52 నుండి 79 ఇబ్రాహీం:35, అర్‌రూమ్: 20, యూసుఫ్: 40, అన్‌నహ్ల: 17, అల్ ఆరాఫ్: 195, అల్‌అన్ఆమ్:75-79, అల్ ఆరాఫ్ : 179).*

- హ(జత్ ముహమ్మద్ సల్లం ఒకే దేవుని భావనను పరిచయం చేశారు. ఒక్క దేవుడిని నమ్మడంవల్ల ఆయన ఆజ్ఞలను పాటించడం వల్ల మనిషి అన్ని రకాల బానిసత్వా లనుండి, నిర్బంధాలనుండి బయట పడగలుగుతాడు. అతనికి నేరుగా దైవంతో సంబంధం ఏర్పడుతుంది. దైవం దాకా చేరడానికి పండితుని, పోప్, పురోహితుని, పీర్, ఫకీరుల అవసరం ఉండదు. దివ్యఖుర్ఆన్‌లో ఇలా అంటోంది.

  **"వహువమఅకుమ్ అయినమాకుమ్ కుంతుమ్"** "మీరు ఎక్కడ ఉన్నా ఆ దైవం మీతోపాటు ఉంటాడు" (అల్‌హదీద్: 4)ఈ విధంగా మహనీయ సల్లం సృష్టికర్త మధ్య ఉన్న తెరను చీల్చివేసి దాసుడిని దేవునితో పరిచయం చేశారు.

- దేవుని ఏకత్వం కోరేదేమిటంటే మానవుడు అన్ని రకాల బానిసత్వాలనుండి స్వతంత్రుడవ్వాలి. ఒకే దేవుడిని నమ్మి తన శిరస్సును ఆ ఒక్క దేవుని ముందే వంచాలని అది కోరుతోంది. "ఫలాహుకుమ్ ఇలాహుంవ్వాహిదన్‌ఫలహు అస్‌లిమూ ఇక మీ దేవుడు ఒకే దేవుడు ఆయనకే మీరు విధేయులవండి"

(అల్‌హజ్:34, అల్‌ఫుర్ఖాన్:43-44, ఖసస్:50, అల్‌కహఫ్:28, అల్‌బఖర: 170, అల్ మాయిద:104, లుఖ్మాన్: 21, అష్ షుఅరా: 150-151, అల్‌అన్‌ఆమ్: 116)

## 2. దైవ దాస్యం వైపునకు సందేశం

- హ(జత్ ముహమ్మద్ (స) ప్రపంచ మానవులందరినీ ఎలాంటి తారతమ్యం లేకుండా అల్లాహ్ వైపు పిలిచారు. ఉచ్ఛనీచాలు, జాతి, కులం, అంటరాని తనం, రంగు, వంశం, భాషా, ప్రాంతం భేదమేమీ చూపకుండా ఒకే ఒక సందేశం వినిపించారు. అది ఇది:
  "మానవులారా! మిమ్మల్నీ, మీకు పూర్వం వారినీ సృష్టించిన మీ ప్రభువును ఆరాధించండి, దీని ద్వారానే మిమ్మల్ని మీరు రక్షించుకునే అవకాశం ఉంది." (అల్‌బఖర: 21)
- ఇస్లాం ధర్మంలో ప్రభువు ఆరాధన అంటే జీవితంలో మినహాయింపు లేకుండా దైవాదేశాలను, విధేయతను అవలంబించడం. దేవుని దాస్యం, పూజాపురస్కారాల వరకే కాదు. పూర్తిజీవితంలో వాటిని శిరసావహిం చడం. పుట్టినప్పటినుండి గిట్టేవరకు తమ పనులన్నింటినీ దైవ ప్రసన్నత కోసం చేయడమే దైవారాధన. తమ ఇష్టం, కోరికలను దైవాజ్ఞ ముందు కట్టిపడేయడమే ఇస్లాం. దేవుని ఆరాధన కోసం దేవుని ఆదేశాలు, హితోపదేశాలు తెలుసుకోవడం చాలా అవసరం. అవి దివ్యఖుర్‌ఆన్ హదీసుల రూపంలో ఉన్నాయి. వాటిలో సూచించిన బోధనలలో, విశ్వాస నమ్మకాలు, హృదయ ప్రక్షాళనం, నైతికవిలువలు, సామాజిక, ఆర్థిక, రాజకీయ, యుద్ధనీతి, ఒప్పందం నియమాలు, అంతర్జాతీయ సంబం ధాలు మొదలయినవి ఉన్నాయి. (అల్‌బఖర: 207-208, అజ్ జారియత్: 56, అల్ అన్‌ఆమ్ : 162, అన్‌నిసా : 59).
- అల్లాహ్ ఆరాధన చేయడం అంటే 'అతీఉల్లాహ వ అతీఉ(రసూల్' "అల్లాహ్ ఆయన ప్రవక్తకు విధేయత చూపండి" ఎవరు ప్రవక్తకు విధేయత

చూపారో వారు అల్లాహ్‌కు విధేయత చూపారు. అల్లాహ్ ఏ ప్రవక్తను పంపినా, ఆయన ఆదేశానుసారం నడుచుకుంటూ, ఆ ప్రవక్తకు విధేయత చూపాలి. విధేయత అంటే దివ్యఖుర్‌ఆన్‌లోను, హదీసులోను ఏ విషయాలను ఆజ్ఞాపించడం జరిగిందో వాటిని ఆచరించడం. ఏ విషయాలను వారించడం జరిగిందో వాటికి దూరంగా ఉండడమే.

అల్లాహ్-ఆయన ప్రవక్తను విశ్వసించడం అంటేనే విధేయత. అవిధేయత, విశ్వాసం ఒక చోట ఉండజాలవు. హజ్రత్ ముహమ్మద్ (స) అన్నారు: మీలో ఏ వ్యక్తి అయినా తన కోరికలను ఖుర్‌ఆన్‌కు అనుగుణంగా మార్చుకోనంతవరకు విశ్వాసవంతుడు కాలేడు. *(అన్‌నిసా : 62-65, అల్ హషర్ : 7, మిష్కాత్)* అల్లాహ్ తన గ్రంథంలో:

"మానవులారా! మీ ప్రభువు తరఫునుండి మీ వద్దకు స్పష్టమయిన నిదర్శనం వచ్చింది. మేము మీ వద్దకు మీకు స్పష్టంగా మార్గం చూపే జ్యోతిని పంపాము. ఇక అల్లాహ్ మాటను ఆలకించేవారిని, ఆయన శరణు వేడుకునే వారిని తన కరుణతో, తన అనుగ్రహంతో కప్పివేస్తాడు. వారికి తనవైపునకు వచ్చే ఋజుమార్గం చూపుతాడు."

*(అన్‌నిసా : 174-175)*

## 3. అల్లాహ్ ముందు జవాబుదారీతనం

- ఈ ప్రపంచం గురించి వివిధ భావనలు ఉన్నాయి. జైన, బౌద్ధ మతాలు దైవ భావనతో ఖాళీ ఉన్నాయి. వారి భావన ప్రకారం ఈ ప్రపంచం ఒక మాయాజాలం. అవి ప్రపంచాన్ని నరక కూపంగా భావిస్తాయి. ప్రపంచం నుండి విమోచనం పొందగోరుతాయి. పునర్జన్మను విశ్వసించే (హిందూమతారాధకులు) వారు ఈ ప్రపంచాన్ని ప్రతిఫల నివాసంగా భావిస్తారు. వారి భావన ప్రకారం ఆచరణ (కర్మ)ల ఫలం వివిధ రూపాలలో ఇక్కడే దొరుకుతుంది. అలాగే హేతువాదులు ఈ ప్రపంచం అకస్మాత్తుగా ప్రేలుడు వల్ల సంభవించిందని నమ్ముతారు. ఈ సృష్టికి

కర్త ఎవరు? దీనిని నడిపించే వారెవరు? ఆయన కోరేదేమిటి? అనేది వారికి అనవసరం. వారి ఆలోచనల ప్రకారం ఈ ప్రపంచం సంతోషంతో గడపవలసిన ప్రదేశం. కోరింది తినండి,. త్రాగండి, విచ్చలవిడిగా జీవించండి. మరణించిన తరువాత మరో జీవితం లెక్కాపక్కా ఏమీ లేవు. ఈ భావనలో మనిషిని అడవుల్లోకి పంపి సన్యాసిగా మారేలా చేస్తాయి. లేదా ప్రపంచమే సర్వస్వం ఇక్కడ ఎలాంటి నిర్బంధాలు లేవు. మనుషులు సర్వ స్వతంత్రులమనే భావన కలిగి జీవిస్తే అది విశృంఖలత్వాన్ని జనింపజేస్తుంది.

- మానవుడు బాధ్యతారహితుడుగా జన్మించలేదనే సందేశాన్ని వినిపించారు మహాప్రవక్త. ప్రపంచం ఒక పరీక్షా కేంద్రం. ఇక్కడ రాజ్యం చేయడానికి స్వయం నిర్ణయాధికారం స్వతంత్రం ఇవ్వబడింది. బలవంతం ఏమీలేదు. అల్లాహ్ తరఫు నుండి మనిషి ముందు రెండు మార్గాలు ఉంచడం జరిగింది. ఒకటి మేలు. రెండవది కీడు. వాటిని అనుసరించడం వల్ల కలిగే పరిణామాల గురించి కూడా వివరించడం జరిగింది.

  'మీలో మంచి పనులు చేసేవారెవరో పరీక్షించి చూద్దామని ఆయన చావు బ్రతుకులను సృష్టించాడు.' *(అల్‌ముల్క్: 2)*

- "ఆ రోజున శంఖం పూరించబడుతుంది. ఆకాశాలలో, భూమిలో ఉన్న వారు అందరూ చచ్చిపడిపోతారు, అల్లాహ్ సజీవంగా ఉంచదలుచుకున్న వారు తప్ప. తరువాత రెండోసారి శంఖం పూరించబడుతుంది. అప్పుడు ఒక్కసారిగా అందరూ లేచిచూడటం ప్రారంభిస్తారు. భూమి తన ప్రభువు యొక్క తేజస్సుతో వెలిగిపోతుంది. కర్మల చిట్టా తీసుకురాబడుతుంది." (అజ్‌జుమర్ : 68)

- తీర్పుదిన మైదానంలో ప్రతివ్యక్తి అల్లాహ్ ముందు నిలుచుని సమాధానం ఇవ్వవలసి ఉంది. అక్కడ ఎవరి సిఫారసు చెల్లదు. ఆనాడు తండ్రి, కుమారుడు, స్నేహితుడు ఎవరూ ఎవరికీ అక్కరకు రారు. అక్కడ దక్షిణ సమర్పించబడదు. లంచమూ చెల్లదు. ఎవరి దౌర్జన్యం కూడా సాగదు.

ఒకరు మరొకరి పాపాలకు పరిహారం చెల్లించనూ లేరు. అక్కడ ఒకరి ఆచరణకు మరొకరు బాధ్యులు కాలేరు. ప్రతి మనిషి తన సాఫల్యం కోసం కలవరపడిపోతాడు. తన విమోచనం కోసం తన తలిదండ్రులు, భార్యాపిల్లలు బలయిపోతే బాగుండు అని తలుస్తాడు.

*(అల్‌బఖర:254, అల్‌ముఆరిజ్:11-14, ఫాతిర్:118, అల్ బఖర : 141)*

- అక్కడ న్యాయం కోసం కావలసిన షరతులన్నీ పూర్తిచేయబడతాయి. మనిషి కర్మల పత్రం అతని ముందుంటుంది. తను చేసిన రవ్వంత పుణ్యం – రవ్వంత పాపాన్ని అక్కడ చూసుకుంటాడు. అతని ఘనకార్యాలన్నీ అతనికి చూపించబడతాయి. ప్రవక్తలు ఇంకా మానవుడి అవయవాలు సాక్ష్యమిస్తాయి. ఆ తరువాత సత్యంతో తీర్పు చెప్పబడుతుంది. ఎవరిపట్లనయినా రవ్వంత దౌర్జన్యం జరగదు.

  *(బనీ ఇస్రాయిల్:141, అల్ జాసియా:129, అల్ కహఫ్ : 49, అల్ జిల్ జాల్ : 2-6, యాసీన్ : 65, హమీమ్ సజ్దా : 20-21, అజ్‌జుమర్ : 69, ఆరాఫ్ :6)*

- అల్లాహ్ తీర్పు నిష్పక్షపాతంగా ఉంటుంది. ఎవరయితే ప్రపంచలో కుఫ్ర్ – షిర్క్‌లలో లీనమయి దుర్మార్గంలో దైవ అవిధేయతలో కృషి చేశారో వారి నివాసం నరకం అవుతుంది. ఎవరయితే ప్రాపంచిక జీవితాన్ని దైవవిధేయతలో గడిపారో తమ కోరికలను చెడునుండి రక్షించుకున్నారో వారు వరాలతో విలసిల్లే స్వర్గంలో ప్రవేశిస్తారు వారే విజేయులు. (అల్‌కహఫ్ : 104, అన్నాజిఆత్ : 3-4, ఆలి ఇమ్రాన్: 185)

## పరలోకం - నిదర్శనాలు

- మరణానంతర జీవితం గురించి దివ్యఖుర్‌ఆన్ దృష్టాంతాలతో వివరించింది. వాటిని కాస్తోకూస్తో తెలివున్న వ్యక్తి కూడా అర్థం చేసుకోగలుగుతాడు.
- ప్రతిరోజు మనం పడుకుని మేల్కొంటాము. మరణించి లేపటం కూడా అంతే. (అజ్ జుమర్ : 42, అల్ అన్‌ఆమ్ : 60 భావం)

- మరలా జీవించడం అనేది ఎండి బీడువారిన భూమి వర్షం తరువాత నవనవ లాడుతూ ఉండడం వంటింది.

*(అల్ హజ్ : 5-7, అర్‌రూమ్ : 24 భావం)*

- ఏ దేవుడయితే వైభవోన్నతమయిన సృష్టిని సృష్టించాడో, ఆయన రెండవ సారి మనిషిని సృష్టించడం కష్టమయిన పనేంకాదు.

*(బనీఇస్రాయీల్ : 98-99, అన్‌నాజిఅత్ : 27-36 భావం)*

- మనిషిని మొదటిసారి సృష్టించినవానికి రెండవసారి సృష్టించడం సమస్య ఏమీకాదు. *(అల్‌మూమినూన్: 14-16, అల్ ఖియామహ్: 36-40 భావం)*
- మంచి చేసినవారికి బహుమతులు లభించాలి, చెడు చేసినవారికి శిక్ష లభించాలనే విషయాన్ని జ్ఞానం కూడా సమ్మతిస్తోంది. *(అల్‌ఖలమ్: 36 భావం)*
- పరలోక భావన మనిషిలో బాధ్యతా భావాన్ని జనింపజేస్తుంది. అప్పుడు అతడు విశృంఖల పశువుగా స్వేచ్ఛగలవాడనని భావించుకోలేడు. అతడు దేవుని పట్ల ఏమరుపాటులో పడిఉండడు. ఎల్లప్పుడు తనను దైవం చూస్తున్నాడని భావించి పరలోకంలో "సమాధానం ఇవ్వాల్సి ఉందనే భీతితో వ్యవహరిస్తూ ఉంటాడు.
- పరలోక భావన మానవుని నైతికత, ప్రవర్తనలపై ప్రభావం వేస్తుంది. సత్యసంధత గలవానిగా నిజాయితీపరునిగా, అమానతుదారునిగా ఒక్కొక్క ఆచరణలో అది కాన వస్తుంటుంది. స్వచ్ఛమైన ఆచరణ అతనిది. ఎందుకంటే అల్లాహ్ ప్రసన్నత, పరలోక సాఫల్యమే అతని ఆశయమవుతుంది.
- పరలోకంపై గనక నమ్మకమే లేకపోతే అల్లాహ్‌పై, ఆయన ప్రవక్తలపై, దైవగ్రంథాలపై, దైవదూతలపై, నమ్మకం ఉంచడం అసంభవం. ఇస్లామీయ విశ్వాస నమ్మకాలలో ఇవి ఒకదానితో మరొకటి అవినాభావ సంబంధాలు కలిగిఉన్నాయి.

## హజ్రత్ ముహమ్మద్ (స) ప్రపంచవాసులకు ఒక క్రమశిక్షణగల జీవన గమనం చూపారు

ప్రపంచంలో ప్రవక్తలను పంపబడిన ఆశయం ఏమిటంటే ఒక న్యాయ పరమైన సమాజాన్ని స్థాపించడం. దీనిని ధర్మసంస్థాపన అని కూడా అంటారు. *(అల్ హదీద్ : 25, అషూరా :13 భావం)* మరొక చోట మహనీయ (స) గురించి ఈవిధంగా స్పష్టం చేయబడింది:

"ఆయనే తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్నీ, సత్యధర్మాన్ని ఇచ్చి పంపాడు. దానిని సకల ధర్మాలపై ఆధిక్యత వహించే ధర్మంగా చేయటానికి ఇది బహుదైవారాధకులకు ఎంత అనిష్టమైనా సరే." *(అస్సఫ్ : 9)*

● హజ్రత్ ముహమ్మద్ సల్లం తెచ్చిన ఇస్లాం ధర్మం ప్రత్యేకత ఏమిటంటే అది ప్రపంచం వేరు ఆధ్యాత్మికత వేరు అనే భేదం చూపదు. అది ఆధ్యాత్మికతకు ప్రపంచానికీ మూలం. అందులో బాధ్యతలకు జడిసి పారిపోవడం, ప్రపంచానికి దూరంగా ఉండి, దానిని విస్మరించడం వంటి బోధనలు ఇస్లాంలో లేవు. దాని గురించి ఖుర్ఆన్ ఇలా అంటోంది:

"సన్యాసత్వాన్ని వారే స్వయంగా కల్పించుకున్నారు. మేము వారికి దాని గురించి ఆజ్ఞాపించలేదు. ఇంకా అల్లాహ్ పరిశుద్ధమయిన వస్తువులు తినాలని అందంగా అలకరించుకోవాలని, పరిశ్రుభంగా ఉండాలని, ఇతరుల హక్కులు ఇవ్వాలని బోధించాడు. *(ఆరాఫ్ : 31-32, అల్ మాయిద : 88, అల్ బఖర : 168, అల్ ముద్దసిర్ : 5 భావం)*

అందువల్లనే మహనీయ (స) ఇస్లాంలో సన్యాసత్వం లేదు అని అన్నారు. (రూహుల్మఅని) ఒకసారి ఆయన అనుచరులలో నుండి ఎవరో అన్నారు: "నేను రాత్రంతా నమాజు చేస్తూనే ఉంటాను." మరొకరు అన్నారు: "నేను ఎల్లప్పుడూ ఉపవాసంతో గడుపుతాను." ఇంకొకరు అన్నారు: "నేను వివాహం చేసుకోను" ఈ విషయం ఆయన సల్లం గారికి తెలియగానే: "నేను రాత్రుల్లో నమాజు చేస్తూ ఉంటాను, పడుకుంటాను కూడా. ఉపవాసం ఉంటాను, ఉండను కూడా. స్త్రీలను వివాహం కూడా చేసుకుంటాను. ఇక ఎవరు నా

సంప్రదాయాన్ని వ్యతిరేకిస్తాడో అతడు మాలోని వాడు కాదు అన్నారు.” (బుఖారి, అనస్ రజి ఉల్లేఖనం)

● హజ్రత్ ముహమ్మద్ సల్లం కేవలం దేవుని ఏకత్వం, దైవదౌత్యం, పరలోకం గురించే బోధించలేదు, పైగా విశ్వాస నమ్మకాలపునాదులపై మానవ జీవితపు పూర్తి వ్యవస్థను నడిపించి చూపారు. ఒక నూతన సంస్కృతికి ఆయన (స) అంకురార్పణ చేశారు. ఆయన సల్లం మనిషి జీవితపు విభిన్న విషయాలను అంటే, నైతిక విలువలు, సామాజిక వ్యవహారాలు, ఆర్థిక విధానాలు, రాజనీతి, న్యాయస్థానాల వ్యవస్థను రూపొందించి నడిపించి చూపారు. ఇంకా కొన్ని విషయాలు దివ్యఖుర్ఆన్, హదీసుల మూలంగా సంక్షిప్తంగా కింద వివరిస్తున్నాము.

## 1. నైతిక విలువలు

నైతిక విలువలు అంటే మనిషి పూర్తి ప్రవర్తన. అవి అతని ఆలోచన అలవాట్లు, అతని జీవిత ప్రవర్తనపై ప్రభావం వేస్తాయి. హజ్రత్ ముహమ్మద్ సల్లం బోధనలు చెడు అలవాట్లను ఖండించాయి. ఆలోచనాపరంగా కూడా చెడులు ఉంటాయి. అవి మనిషి ప్రవర్తనపై ప్రభావం వేస్తాయి. ఉదాహరణకు గర్వం, గర్వపడేవారిని అల్లాహ్ ఇష్టపడడని ఖురాన్ చెబుతోంది. గర్వం షైతాన్‌కు గుర్తింపు. (అన్‌నహ్ల్ :16 అల్‌బఖర : 34, ఆరాఫ్ : 133) ఇంకా ఆయన సల్లం అన్నారు: “ఎవరి హృదయంలో రవ్వంత గర్వం ఉంటుందో అతడు స్వర్గంలో ప్రవేశించలేడు. ఇంకా శత్రుత్వం, కాపట్యం వంటి చెడులు మనిషి ఆధ్యాత్మికతను హరించి వేస్తాయి. అగ్ని మంటలవలె పుణ్యాలు కుడా హరించిపోతాయి.” (మిష్కాత్ అబూదావూద్)

‘అనుమానాలకు దూరంగా ఉండాలని అల్లాహ్ ఉద్బోధించాడు.’

*(హుజురాత్ : 12)*

ఆయన అన్నారు: ‘ఒక నిజాయితీ గల వ్యక్తి హృదయంలో లోభత్వం, ఆపేక్ష ఉండజాలవు.’

● దివ్యఖుర్ఆన్‌లో అసత్యానికి దూరంగా ఉండాలని తాకీదు చేయ బడింది. (అల్‌హజ్:30, ఫుర్ఖాన్: 72) ఆయన (స) అన్నింటికంటే అత్యధికంగా అసత్యం గురించి వారించారు. ఎందుకంటే అసత్యం మనిషి వ్యక్తిత్వాన్ని (Personality) నాశనం చేస్తుంది. ఏ సందర్భంలోనూ అసత్యానికి అనుమతి లేదు. అది ఆలోచనాత్మ కంగానైనా, పరాచికానికయినా సరే. (ఇబ్నెమస్ఊద్ రజి ఉల్లేఖనం అల్ ఆదాబ్ మఫ్‌రూ) పరిశీలించకుండా మాట్లాడే వ్యక్తిని అసత్యవాదిగా పరిగణించవచ్చు. (అబూహురైర రజి ఉల్లేఖనం; ముస్లిం) (అబద్ధసాక్ష్యాన్ని) ఆయన మహాపాపాలలో చేర్చారు. (అబూదావూద్)

● సామాజిక చెడులలో చాడీలు చెప్పడాన్ని మరణించిన సోదరుని మాంసం తినడంతో పోల్చడం జరిగింది. దెప్పిపొడవడాన్ని, ఇతరుల సంభాషణను రహస్యంగా వినడాన్ని, వెక్కిరించడాన్ని, వారించడం జరిగింది. (అల్‌హుజురాత్ : 11-12, అల్ హుమజహ్ : 1-2) ఆయన (స) తిట్టడాన్ని, అశ్లీలమాటలు పలకడాన్ని వారించారు. (ఉల్లేఖనం ఇబ్నెఉమర్ (రజి), రియాజ్ ఉస్సలెహీన్) ఎవరిలో నాలుగు విషయాలు ఉంటాయో వారు కపటులు అన్నారు (స). అమానతుగా పెట్టిన దాన్ని అపహరించేవారూ, మాట్లాడినప్పుడు అసత్యం పలికేవారూ, వాగ్దానం చేసి దానిని భంగపరిచేవారు, వివాదంలో పడేవారు. (ఉల్లేఖనం అబ్దుల్లా బిన్ ఉమర్ రజి, బుఖారి)

చూడ్డానికయితే ఈ చెడులు చాలా మామూలుగాను అల్పంగాను తోస్తున్నాయి. కాని వీటివల్ల పరస్పర సంబంధాలు బెడిసి కొట్టి సమాజంలో ఉపద్రం చెలరేగుతుంది.

## కొన్ని నిషిద్ధ పదార్థాలు

ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఆదేశం : "అల్లాహ్ నిషేధించినవి ఏమన్నా ఉంటే అవి ఇవి మాత్రమే : మరణించినవాటిని తినకండి, రక్తాన్ని, పంది మాంసాన్ని

ముట్టకండి. ఇంకా అల్లాహ్‌కు కాక ఇతరులకు సమర్పించబడిన దానిని తినకండి." *(అల్ బఖర :173 అన్ నహ్ల : 115)*

"వ్యభిచారం దరిదాపులకు కూడా పోకండి. అది మహా చెడ్డపని, బహు చెడ్డమార్గం." (బనీఇస్రాయీల్ : 32)

దీనివల్ల సంస్కృతి నవ్వులపాలవుతుంది. అందువల్లనే అశ్లీల ప్రచురణను కూడా అధర్మసమ్మతంగా నిర్ధారించడం జరిగింది. "విశ్వాసుల వర్గంలో అశ్లీలత వ్యాపించాలని కోరేవారు, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వ్యథాభరితమైన శిక్షకు అర్హులు." (అన్ నూర్ : 20)

"విశ్వాసులారా! సారాయి, జూదం, దైవేతర మందిరాలు, పాచికలద్వారా జోస్యం- ఇవన్నీ అసహ్యకరమైన షైతాను పనులు. వాటిని విసర్జించండి. మీకు సాఫల్య భాగ్యం కలిగే అవకాశం ఉంది." (అల్ మాయిద : 90)

● సారాయి, జూదం, బలిపీఠం, జాతకం చూపించుకోవడం వంటివన్నీ షైతాన్ చేష్టలు, వాటికి దూరంగా ఉండండి. సారాయి ఆరోగ్యానికి హాని చేకూరుస్తుంది. కుటుంబాన్ని ఛిన్నాభిన్నం చేస్తుంది. జూదం కూడా పేరాశకు గురిచేసి వినాశనం పాలు చేస్తుంది. సారాయి సేవనం గురించి ఖండిస్తూ: ప్రతి మత్తుపదార్థం, సారాయియే, ప్రతిమత్తు పదార్థం నిషేధం, అని ఆయన (స) హెచ్చరించారు. (ముస్లిం, అబూదావూద్, తిర్మిజి) ఏ పదార్థంలో అత్యధిక మత్తు ఉంటుందో అది అల్పంగా తీసుకోవడం కూడా నిషేధమే (అబూ దావూద్, ముస్నద్ అహ్మద్). సారాయి సేవించే వారితో కలసి భుజించడాన్ని ప్రవక్త మహనీయులు వారించారు. (సుననేదారిమి) ఒక ఉల్లేఖనంలో: సారాయి అన్ని చెడులకు మూలం అని చెప్పబడింది. (తిబ్రాని) సారాయి బుద్ధి మాంధ్యంలో పడవేస్తుంది. మనిషి అదుపుతప్పి ప్రమాదానికి గురవుతాడు. తిట్లకు కొట్లాటలకు దిగుతాడు అంతేకాదు. దొంగతనానికి, హత్యలకు పాల్పడతాడు. తాగు బోతులో మంచిని ఆశించలేము కదా!

● ఇస్లాంలో ఉన్న (హరాం-హలాల్) ధర్మసమ్మతం అధర్మ సమ్మతాలలో గొప్ప వివేకం దాగిఉంది. శరీరానికి, నైతికతకు నష్టం చేకూర్చే పదార్థాలను మాత్రమే నిషేధించడం జరిగి

## గుణగణాలు-విశిష్టత

అనైతికతకు ప్రతిగా నైతికతను అవలంబించాలని ప్రోత్సహించారు. దాని కోసం ఆయన (స) వ్యక్తిత్వం ఒక ఆదర్శం.

మంచివారి సహవాసం చేయండని అంటోంది దివ్యఖుర్‌ఆన్.

*(అత్ తౌబ : 119)*

ఎల్లప్పుడు సత్యం పలకాలని, సత్యమార్గంపై నడవాలని ఆయన(స) ప్రభోదించారు. (ఉల్లేఖనం ఇబ్నెమస్‌ఊద్ రజి ముత్తఫిఖ్ అలైహ్) ఎన్ని సుగుణాలయితే ఉన్నాయో అవన్నీ సత్యానికి చెందిన శాఖలు ఆయన(స) బోధనలలో మనకు అమానతు, సహనం, వాగ్దానం న్యాయం మధ్యే మార్గం. దైవమార్గంలో ఖర్చు, సిగ్గు బిడియం, క్షమాగుణం, దైవభీతి, ఉపకారం వంటి బోధనలు, అనేక సార్లు కనిపిస్తాయి.

● హ|జత్ ముహమ్మద్ (స), మేలు - కీడుల స్థానం మనిషి హృదయం అని ఉద్బోధించారు. మేలు అంటే మంచినైతికతను అంటారు. మీ పాపం మిమ్మల్ని వేధిస్తుంటే అది ప్రజలకు తెలియకూడదని మీరు భావిస్తే అదే కీడు అన్నారు ఆయన (స) (ముస్లిం). దైవభీతిని అవలంభించేవారిని ఏ విషయం అనుమానంలో పడవేస్తుందో దానిని వదలి అనుమానం కలిగించని దానిని అవలంబించండి. అదే విధంగా ఉపకారం (ఇది ఇస్లామీయ బోధనలలో అత్యున్నతమయిన స్థాయి గలది) గురించి చెపుతూ మీరు అల్లాహ్ ఆరాధనను అల్లాహ్‌ను మీరు చూస్తున్నారని భావించి చేయండి. లేదా అల్లాహ్‌యే మిమ్మల్ని చూస్తున్నాడని భావించి చేయండి ఇదే ఉపకారం. (ఉల్లేఖనం ఇబ్నెఉమర్ రజి, ముస్లిం)

- మహనీయ సల్లం సర్వసాధారణంగా సౌభ్రాతృత్వం, సమైక్యత, పరస్పర సహకారం, కోసం ప్రేరణ కలిగించేవారు. అనాధలు, ఆర్తులు, నిరుపేదలు, దేహీ అనేవారు, వితంతువులు, నిరాశ్రయులు మొదలయిన వారికి సహాయం చేస్తే మంచి ప్రతిఫలం లభిస్తుందనే శుభవార్త వినిపించారు. హజ్రత్ ముహమ్మద్ (స) సృష్టితాలన్నీ అల్లాహ్ కుటుంబం, అల్లాహ్ సృష్టితాల పట్ల ఎవరికి ప్రేమ ఉంటుందో వారిని అల్లాహ్ ప్రేమిస్తాడు. (బైహఖి) ఇతరులకు లాభం చేకూర్చేవాడే అందరికంటే ఉత్తమమయిన వ్యక్తి అని ఉపదేశించారు. (కన్‌జుల్ హఖాయెఖ్)
- మహనీయ(స) నైతిక గుణగణాలను అల్లాహ్‌పై విశ్వాసంతో, పరలోక విశ్వాసాన్ని వ్యవహారాలతో జోడించారు. అందువల్లనే ఇస్లామీయ బోధన బాహ్యం నుండి అంతరంగం వరకు ప్రక్షాళనం చేస్తాయి. మీలో ఎవరు అల్లాహ్‌పై, పరలోకంపై విశ్వాసం కలిగి ఉంటాడో అతడు మంచిమాటనే పలకాలి. లేదా మౌనంగా ఉండాలి. (అల్ అదాబఖఅల్ ముఫ్రద్) వ్యభిచారం చేసేవాడు విశ్వాసి కాలేడు. దొంగతనం చేస్తే అతడు విశ్వాసి కాజాలడు. మత్తు సేవిస్తే మోమిన్‌గా మిగలడు. (ఉల్లేఖనం అబూహురైర; ముస్లిం)
- హజ్రత్ ముహమ్మద్ (స) మానవులకు నైతిక విలువలతోపాటు జీవనసరళిని కూడా నేర్పించారు. ఉదాహరణకు పరస్పరం కలుసుకున్నపుడు సలాం చేయడం. రోగిని పరామర్శించడం, అతిథికి సత్కారం చేయడం, భోజన ప్రారంభంలో బిస్మిల్లాహ్ పలకడం, తరువాత అల్లాహ్‌కు కృతజ్ఞతలు చెల్లించడం, సమావేశ మర్యాదలు, పరస్పరం బహుమతులు ఇచ్చు కోవడం, ఒకరి సంతోషంలో, దుఃఖంలో పాలుపంచుకోవడం కూడా నేర్పించారు. ఇంకా గుసగుసలాడరాదని కూడా హితవు చేశారు. అంతేకాదు, శరీర పరిశ్రుభత గురించి కూడా వివరించారు.

*(బుఖారి, ముస్లిం)*

## 2. ఆరాధనలు

ఒక ప్రముఖ హదీసులో ఇస్లాంకు ఐదు మూలస్థంభాలు ఉన్నాయని చెప్పబడింది. 1. అల్లాహ్ తప్ప మరొక దేవుడు లేడు. హజ్రత్ ముహమ్మద్ (స) ఆయన దాసుడు, ప్రవక్త అని సాక్ష్యమివ్వడం. 2. స్థిరంగా నమాజు చేయడం. 3. జకాత్ చెల్లించడం. 4. రమాజాను మాసంలో ఉపవాసాలు ఉండడం. 5. హజ్ చేయడం *(ఉల్లేఖనం ఉమర్ రజి, ముస్లిం)*

**1. విశ్వాస** వచనం పలికి ఇస్లాంను విశ్వసించిన తరువాత నమాజ్ విధిగా చేయబడింది. ఐదుపూటల నమాజు తప్పనిసరి చేయడంలో ఎన్నో లాభాలు ఉన్నాయి. ఉదాహరణకు నమాజు కోసం పరిశుభ్రంగా ఉండడం తప్పనిసరి. నమాజువల్ల భక్తుని సంబంధం దేవునితో పటిష్ఠమవుతుంది. నమాజు చెడుల నుండి, అశ్లీలం నుండి ఆపుతుంది. నమాజ్ క్రమశిక్షణ నేర్పుతుంది. (తాహా : 14, అన్ కబూత్ : 45, అన్నిసా : 103 భావం)

**2. రమజాను** మాసంలో ఉపవాసా (రోజా)లు విధిగా చేయబడడానికి కారణం, అల్లాహ్ మానవుల మార్గదర్శకత్వం కోసం ఖుర్ఆన్‌ను అవతరింపచేయడం. రమజాను మాసం దైవభక్తి, దైవభీతి, నైతికవిలువల శిక్షణనిచ్చే మాసం. రోజాను పొందడం కోసం పొద్దస్తమానం అన్నపానీయాలను, స్వాభావికమయిన కోరికలను విడనాడవలసి ఉంటుంది. ఐదుపూటలా నమాజు ఆచరించవలసి ఉంటుంది. దివ్యఖుర్ఆన్ పఠింపబడుతుంది. బీదసాదలకు అత్యధికంగా సద్ఖా (దానం) చేయ బడుతుంది.

**3. జకాత్** మానవ హక్కులకు సంబంధించింది. జకాత్ విధిగాచేయడంలో రెండు కారణాలున్నాయి. ఒకటి సంపన్నుల పాపాలు ప్రక్షాళనం అవుతాయి. రెండు బలహీన వర్గాలకు సహాయం లభిస్తుంది. (తౌబ: 60:103) హజ్రత్ ముహమ్మద్ (స) అన్నారు: నిస్సందేహంగా అల్లాహ్ ప్రజలపై జకాత్‌ను విధిగా చేశాడు. దానిని ధనికులనుండి వసూలు చేసి ఫకీరులలో, నిరుపేదలలో

పంచడం జరుగుతుంది. (బుఖారి, ముస్లిం) బంగారం, వెండి, నగదు వ్యవసాయ ఉత్పత్తి, జంతువులపై నిర్దేశించిన శాతం ప్రకారం నిర్ణీత తేదీలలో ఒక ప్రత్యేక విధానం ప్రకారం చెల్లించబడుతుంది. జకాత్ చెల్లించని పక్షంలో నరక శిక్ష గురించి హెచ్చరిక చేయబడింది. (తౌబ:34-35).

**4. హజ్** జిల్‌హిజ్జ నెలలో మక్కా వెళ్ళి కాబా గృహాన్ని సందర్శించి ఇతర విధులను నెరవేర్చడాన్ని హజ్ అంటారు. ఇది ఆర్థిక స్థోమత గలవారికి జీవితంలో ఒక్కసారి విధిగా చేయబడింది. (ఆలిఇమ్రాన్ : 97) హజ్ అంతర్జాతీయంగా జరిగే ముస్లిముల సమావేశం. ఇందులో పాల్గొనడానికి తూర్పుపడమర, ఉత్తరదక్షిణాల నుండి విభిన్న భాషలు మాట్లాడే ప్రజలు, నల్లవారు, తెల్లవారు, స్త్రీలు, పురుషులు ఏకదైవారాధనా కేంద్రానికి సంతోషంగా తమ ఖర్చులను భరించి దూరతీర ప్రాంతాల నుండి తరలివస్తారు. అందరూ ఫకీరులవలె (ఎహ్రాం) ఒకేతీరు దుస్తులు ధరించి ఒకే భాషలో అల్లాహుమ్మ లబ్బైక్ అల్లాహుమ్మలబ్బైక్ "హాజరయ్యాను ప్రభూ! హాజరయ్యాను అంటూ అర్థిస్తారు. హజ్ వల్ల విశ్వాసానికి బలం చేకూరుతుంది. దైవభీతి ప్రాప్తమవు తుంది. ఏకేశ్వరోపాసన తెలిసివస్తుంది. అంతర్జాతీయంగా మానవ సమా నత్వం, ఇస్లామీయ సౌభ్రాతృత్వానికి ప్రతీక అవుతుంది. హజ్ వల్ల విశ్వాసం, నైతిక విలువల ప్రయోజనాలే కాక ఆర్థిక లాభాలు కూడా చేకూరుతాయి.

● హ(జత్ ముహమ్మద్ (స) వద్దకు ఒక వ్యక్తి వచ్చి ఇలా ప్రశ్నించాడు: ఓ ముహమ్మద్ (స) మీ ధర్మం ఏది? ఆయన (స) : "అల్లాహ్‌ను, ప్రవక్తను విశ్వసించడం. ఆ తరువాత రాత్రింబవళ్ళలో ఐదుసార్లు నమాజు నెరవేర్చడం. సంవత్సరంలో ఒక నెల రోజులు ఉపవాసం (రోజా) ఉండడం. సంపదగలవారయితే ఆ సంపదపై సంవత్సరం గడిచిన తరువాత జకాత్ చెల్లించడం. ఒకవేళ స్థోమత ఉంటే జీవితంలో ఒక్కసారి హజ్ చేయడం. నీవు గనక ఇలా చేసినట్లయితే అల్లాహ్ నీకు స్వర్గం ప్రసాదిస్తాడు" అని అన్నారు. అప్పుడు ఆ వ్యక్తి: నేను ఇందులో ఏ మాత్రం హెచ్చుతగ్గులు

చేయను అని వెళ్ళి పోయాడు. ఆయన (స) అతనివైపు సంజ్ఞచేస్తూ, తనమాటపై గనక స్థిరంగా ఉన్నట్లయితే అతడు స్వర్గవాసియే అన్నారు.

## 3. సమాజం

పరస్పరం కలసిమెలసి సామాజిక జీవితం గడపడం మానవ స్వభావం. ఇందులో వివిధ రకాల వృత్తులవారు ఉంటారు. వారు ఇతరుల అవసరాలను తీరుస్తూ ఉంటారు. కుటుంబాన్ని మనం ఒక యూనిట్‌గా చెప్పుకోవచ్చు. విభిన్న కుటుంబాలు కలిస్తే ఒక సమాజం అవుతుంది. దాని ద్వారానే సంస్కృతి అభివృద్ధి అవుతుంది. ఇస్లాం సమాజంలో పూర్తి న్యాయంతో ఒండొరులపై హక్కులు, భాధ్యతలను పంచుతుంది. ఈనాడు మానవ సమాజం గనక వాటిని అనుసరించినట్లయితే దానికి శాంతి లభిస్తుంది.

అవివాహితులుగా ఉండడాన్ని ఇస్లాం ఇష్టపడదు. ఎందుకంటే ఇది మానవ స్వభావానికి వ్యతిరేకం. వివాహం కోసం ఇస్లాం కొన్ని సంబంధాలను నిషేధించింది. వివాహం స్త్రీపురుషుల సమ్మతమయిన సంబంధంగా నిర్ధారించింది. వ్యభిచారాన్ని నిషేదించింది. దానివల్ల నంస్కృతి కుప్పకూలుతుంది. నికాహ్ అవ్వాలంటే ఎలాంటి బలవంతం లేకుండా పెళ్ళికూతురి అంగీకారాన్ని సాక్షులు ప్రకటించడం తప్పనిసరి. మహర్[6] (స్త్రీ హక్కుగా పరిగణించబడింది. నికాహ్[7] హజ్రత్ ముహమ్మద్ (స) సంప్రదాయం. (అన్‌నూర్: 32, అన్‌నిసా : 22-25, బనీ ఇస్రాయీల్ : 32) కుటుంబ వ్యవస్థలో ఇస్లాం పురుషునికి నిర్వాహకునిగా ఎంపిక చేసింది. అన్నపానీయాలు, వస్త్రాలు, ఇంటి సంరక్షణా ఏర్పాట్ల బాధ్యత అతనిదే. పురుషుడు మేలయిన రీతిలో జీవితం గడపాలని హితవు చేయడం జరిగింది. స్త్రీ పుణ్యవతిగా ఉంటూ, భర్త సంపదను కాపాడాలి. భార్యాభర్తలిద్దరు ఒకరికి మరొకరు ఉపకారిగా ఉండాలని హితవు చేయబడింది. ఇస్లాం బహు భార్యత్వాన్ని సమ్మతించింది. కాని ఇది తప్పనిసరి కాదు. *(అన్‌నిసా : 4, 19, 33, అల్ బఖర:237)*

"మీరు మీ భార్యను చూసినపుడు మీ మనసు సంతోషపడితే, ఆమె మీ ఆజ్ఞను పాలిస్తే మీరు ఇంట్లో లేనపుడు మీ సంపదను, తన స్వభావాన్ని పరిరక్షించుకుంటే ఆమెనే మంచి భార్య అన్నారు దైవప్రవక్త ముహమ్మద్ (స). (జాదుల్‌మఅద్)

● భార్యభర్తల సమస్యలను పరిష్కరించుకోడానికి క్షమించడం, హితవు చేయడం ఇంకా కాస్తంత కఠినంగా వ్యవహరించడాన్ని అనుమతించింది ఇస్లాం. ఆ తరువాత మధ్యస్థంగా మసలుకోవాలని సూచించింది. వ్యవహారం బెడిసికొట్టినట్లయితే విడిపో వడానికి భర్త భార్యకు తలాఖ్ (విడాకులు) ఇచ్చి, లేదా భార్య భర్తకు 'ఖులా' ఇచ్చి విడిపోవచ్చు. అననుకూలపరిస్థితులలో షరీఅత్ కోర్టు ద్వారా కూడా వేరుపడవచ్చు. మహనీయ (స) అన్ని హలాల్ పనులలో తలాఖ్ అయిష్టమైనదిగా నిర్ధారించారు.
(నిసా: 35, అల్‌బఖర : 229-237, అబూదావూద్).

## హక్కులు, బాధ్యతలు

సమాజంలో కల్లోలాలకు కారణం అన్యాయం, హక్కులను కాజేయడం. హజ్రత్ ముహమ్మద్ సల్లం గారు మానవాళికి ఉపకారం చేశారు. అదేమంటే హక్కుదారులకు వారి హక్కు ఇప్పించడం. సమాజంలో న్యాయం స్థాపించడం. ఇంకా తల్లిదండ్రుల గురించి ఖుర్‌ఆన్ ఇలా ఉపదేశిస్తోంది. తల్లిదండ్రుల పట్ల మంచిగా ప్రవర్తించండి. వారు ముసలివారయితే వారికి బాగాసేవ చేయండి. వారిని చీదరించుకోకండి. తల్లిస్థానం, తండ్రికంటే ఉన్నతమయినది. తల్లిపాదాల కింద స్వర్గం ఉంది. తండ్రి స్వర్గానికి ద్వారం వంటివాడు. అని బోధించడం జరిగింది.
(బనీఇస్రా యీల్ : 24-33, అల్ అహ్ఖాఫ్ : 15, ముస్నద్ అహ్మద్, తిర్మిజి, అబూదావూద్)

● బంధుప్రీతికలిగి, బంధువుల హక్కులను నెరవేర్చాలని ఆదేశించడం జరిగింది. ఆయన సల్లం అన్నారు: 'బంధుత్వాలను త్రెంచేవాడు

స్వర్గంలోకి పోలేడు. తల్లి, తండ్రికి ఎవరు ఎంత సన్నిహితులో అతడు వారితో ఉత్తమంగా వ్యవహరించడానికి హక్కుదారుడు.

*(అన్నిసా : అరాద్ : 21, అన్నహ్ల్ 90, బుఖారి, ముస్లిం)*

- **సేవకుల హక్కుల గురించి:** మోయలేనంత బరువు వారిపై మోపకండి. వారి కష్టానికి తగిన ఫలితం చెల్లించండి. ఇది వారి హక్కు. వారు మీ సోదరులు, మీరు ఏది తింటారో అదే వారికీ పెట్టండి. మీరు తొడిగే అటువంటి వస్త్రాలే వారికీ తొడిగించండి. అని హితవు చేయబడింది. హజ్రత్ ముహమ్మద్ (స) మరణ సమయం సమీపించినపుడు ఆయన (స) నోటినుండి: స్థిరంగా నమాజు చేయండి, బానిసలతో సద్భావంగా మెలగండి అనే పదాలు వెలువడ్డాయి. మనుషుల క్రయవిక్రయాలను ఖండించారు. పాప ప్రక్షాళనంకోసం బానిసలను స్వతంత్రులుగా చేయాలని ప్రోత్సహిస్తూ, దానికి బదులుగా స్వర్గం లభిస్తుందని అనడంవల్ల కొద్దికాలంలోనే బానిసల పరంపర అంతమయిపోయింది. *(అన్నిసా : 36, అల్అదాబ్ అల్ ముఫ్రద్, బుఖారి, ముస్లిం, ఇబ్నెమాజ, తిర్మిజి)*

- **అనాథల హక్కుల గురించి:** వారి ఆస్తిపాస్తులను కాపాడండి. ఎవరు అన్యాయంగా వారి సొమ్ముతింటారో వారు తమ కడుపులలో అగ్ని నింపుకుంటున్నారు. అనాథలతో కఠినంగా వ్యవహరించడాన్ని వారించారు. వారితో మేలయిన రీతిలో వ్యవహరిస్తే, వారి బాధ్యతను ఎత్తుకుంటే వారికి స్వర్గం లభిస్తుందన్నారు. 'ఒక అనాథతో మంచిగా వ్యవహరించిన ఇల్లే ఉత్తమమయిన ఇల్లు. వారితో దుష్ప్రవర్తనతో వ్యవహరించిన ఇల్లే అతి చెడ్డ ఇల్లు' అని ఆయన (స) చెప్పారు.

*(అల్బఖర : 22, బనీఇస్రాయీల్ : 34, బుఖారి, ఇబ్నెమాజ)*

- **పొరుగువారి హక్కుల గురించి :** పొరుగున ఉన్న వ్యక్తి ఆకలితో అలమటిస్తుండగా కడుపునిండా భుజించినవాడు విశ్వాసి కాలేడు. తన పొరుగువాడు తన దౌష్ట్యానికి బలయితే అతడు విశ్వాసి కాజాలడు. ఏ

పొరుగువాడు మీకు ఎంత సమీపంలో ఉంటాడో అతడు మీ మంచి ప్రవర్తనకు అంతే హక్కుదారుడు. వారి సుఖదుఃఖాలలో, సంతోష సంబరాలలో మీరు పాలుపంచుకోవాలి. వారిని కనిపెట్టుకుని ఉండాలి. ఇవి ఇస్లామీయ బోధనలు; ఒక ఆరోగ్యకరమైన సమాజానికి ఉండే ప్రత్యేకతలు. (అన్నిసా : 36, బుఖారి : ముస్లిం)

- ఫకీరులు, నిరుపేదల హక్కుల గురించి మీముందు చేయిచాచేవారి, చేయి చాపనివారి ఇద్దరి హక్కులు మీ వద్ద ఉన్నాయి. వారిని ధూత్కరించకూడదని చెప్పబడింది. ఆయన(స) అన్నారు: 'ఉత్తమ దానం (సద్ఖా) అంటే ఆకలిగొన్న వాడికి కడుపునిండా అన్నం పెట్టడం. వితంతువుల సేవకోసం పరిశ్రమించేవారు, అల్లాహ్ మార్గంలో జిహాద్ చేసేవారు, రాత్రులలో ఆరాధన చేసేవారు, ఉపవాసం (రోజా) ఉండేవారందరూ సమానులే అని నుడివారు.

  (అల్‌బఖర : 215, అజ్ జుహ్ : అజ్ జారియత్ : 19, బుఖారి, ముస్లిం)

- హజ్రత్ ముహమ్మద్ (స) గారు ఆరాధనకు మించిన ప్రాధాన్యతను మానవ హక్కులకు ఇచ్చారు. ఒక వ్యక్తి పరలోక దినాన అల్లాహ్ ముందు నమాజు, రోజా, జకాత్‌లను తీసుకుని వెళ్ళాడు కాని, అతడు ఒకరిని తిట్టివచ్చాడు. ఒకరిని కొట్టి వచ్చాడు. ఒకరిపై నిందమోపివచ్చాడు. ఒకరి సొమ్ము కాజేసివచ్చాడు. ఒకరిని హత్యచేసి వచ్చాడు. అందువల్ల దేవుడు అతడు చేసిన పుణ్యాలను వాళ్ళందరిలో పంచివేశాడు. అయినా అతని లెక్క తేలనందున వారి పాపాలను అతనిపై వేసి నరకానికి పంపించాడు. ఉమ్మత్‌లోని అందరికన్నా నిరుపేద అంటే ఇతడే. అని మహానీయ (స) అన్నారు. ఎవరయినా ఎవరి వద్దనయినా అప్పు తీసుకున్నా, బాకీ తీసుకొని తీర్చకపోయినా ప్రళయదినాన అతడు ప్రశ్నింపబడతాడు. షహీద్ అయి (అమరగతిపొంది)తే పాపాలన్నీ క్షమించబడతాయి. ఒక్క అప్పు మినహా అని అన్నారు సల్లల్లాహు

అలైహివసల్లం. ఇంకా ఆయన అప్పుదారుని జనాజ నమాజు చేయించలేదు. *(బుఖారి)*

- పై విషయాలన్నీ మానవ హక్కులకు ప్రాధాన్యత ఇస్తున్నాయి.
- హ(జత్ ముహమ్మద్ (స) ఎలాంటి సమాజాన్ని స్థాపించారంటే అది ఒక శరీరంవలె, ఒక పటిష్టవంతమైన గోడవలె ఉండేది. దాని ఒక భాగం మరొక భాగంతో కలసిఉంది. సానుభూతి, పరస్పర సహాయం, త్యాగం వారి స్వభావంగా మారింది. ఒకరినొకరు మంచిని ఆజ్ఞాపించుకోవడం, చెడునుండి వారించుకోవడం సమాజానికి ఊపిరి వంటివి. (ఆలిఇమ్రాన్ : 110, బుఖారి, ముస్లిం)
- **సమాజంలో స్త్రీస్థానం** మహనీయ ముహమ్మద్ సల్లంకు పూర్వం స్త్రీకి ఎలాంటి స్థానం ఉండేది కాదు. అరబ్బులు ఆడపిల్ల పుడితే సజీవంగా సమాధి చేసేవారు. హిందూ దేశంలో ఆమెను ఒక వస్తువులా అమ్మేసేవారు. దేవదాసిగా వదలివేయడం జరిగేది. భర్త చితిపై భార్య తగులబెట్టబడేది. వితంతువు రెండో పెళ్ళి చేసుకోవడం నిషేధం. వారసత్వంలో హక్కుగాని ఆస్తిపాస్తులపై ఆమెకు ఆధిపత్యంగాని ఉండేదికాదు. ఏ వ్యవహారంలోనైనా ఆమెకు హక్కులు ఇవ్వలేకపోయారు. క్రైస్తవంలో విడాకులిచ్చి విడిపోవడం అనేది లేదు. కాని దానికి ప్రతికూలంగా ఆధునిక పాశ్చాత్య సంస్కృతి, స్త్రీ స్వేచ్ఛ, సమానత్వం పేరుతో ఆమెను బజారుకీడ్చడం జరిగింది. స్త్రీపురుష ఉమ్మడి పార్టీలు, ఆమెను స్టేజీపైకి, వెండితెరపైకి తీసుకొచ్చాయి. అంతేకాదు. ప్రేమ పేరుతో లైంగిక సంబంధాలను అభివృద్ధి చెందిన సంస్కృతిలో చెడుగా భావించడంలేదు. స్త్రీ పురుష సమానత్వం పేరిట స్త్రీలపై అదనపు బాధ్యతలు వేసి, శక్తికి మించిన భారం మోపుతున్నారు.
- అలా చెడుల అంచులకు చేరిన స్త్రీ స్థానాన్ని మహనీయ (స) సమాజంలో ఆమెకు గౌరవస్థానాన్ని ప్రసాదించారు. మానవహక్కులు, నైతిక

విలువలు, పుణ్య ఫలాలలో స్త్రీలకు పురుషులతో సమాన స్థాయిని కలిగించారు. అందువల్ల దైవభక్తి, దైవభీతిలో భార్య భర్తకన్నా ముందుండగలుగుతుంది. (అన్‌నహ్ల్ : 93)

- ఇస్లాం ప్రప్రథమంగా స్త్రీకి ఆస్తిలో హక్కు కల్పించింది.( అన్‌నిసా 11-13)
- ఆమె ధర్మసమ్మతమయిన సంపాదనను హక్కుగా పరిగణించింది. ఇతరత్రా వాటి యాజమాన్య హక్కును కూడా సమ్మతించడం జరిగింది.
- వివాహానికి స్త్రీ ఇష్టాఇష్టాలు అత్యవసరం చేసింది. బాల్యంలోనే వివాహమైతే ఆమె యుక్తవయసుకు చేరిన తరువాత దానిని వ్యతిరేకించే హక్కు కలిగి ఉంది. మహర్ ఆమె హక్కు. భర్త స్తోమతను బట్టి ఇచ్చే భరణం. ఇది ఆమె హక్కు.(అన్‌నిసా:24, అల్ బఖర : 231-233)
- భార్య ఏదో ఓ కారణంవల్ల భర్తతో సహజీవనం చేయదలచుకోకుంటే ఆమె తన భర్తకు "ఖులా" ఇవ్వవచ్చు లేక చెప్పుకోదగ్గ కారణం అంటే ఇస్లాం విడనాడితే, తప్పిపోతే, భరణం చెల్లించకపోతే, నపుంసకత్వంవల్ల, సుదీర్ఘకాలం జైలులో గడిపితే, పిచ్చిపడితే, ఘోర వ్యాధికి గురయితే షరీఅత్ కోర్టుకు వెళ్ళవచ్చు. (అల్‌బఖర : 229-231)
- ఇస్లాం చూపులను నేలవాల్చాలని, పరదాపాటించాలని ఆజ్ఞాపించింది. నిస్సిగ్గుగా వ్యవహరించడానికి, అశ్లీల ప్రచారాన్ని నిషేధించింది. దీనికి కారణం స్త్రీల పరిరక్షణ, నైతిక విలువల పవిత్రత.
(అన్ నూర్ : 19, 31, అల్ ఆరాఫ్ :26 - 28, అల్ అహ్‌జాబ్ : 33-35)
- స్త్రీ ఆచరణా పరిధిని ఆమె స్వభావానికి అనుగుణంగా ఆమె ఇంటివద్దనే ఉండడానికి ప్రాధాన్యతనిచ్చింది. ఇంటి వంట పని, పిల్లల ప్రాథమిక విద్యాబోధన స్త్రీయే బాగా నిర్వహించగలుగుతుంది. అందువల్ల పరిధుల్లో ఉంటూ సామాజిక, విద్య, ఆర్థిక, రంగాలలో పనిచేయడానికి అభివృద్ధి సాధించడానికి ఇస్లాం స్త్రీకి ఏలాంటి ఆటంకం కలిగించలేదు.
*(అల్ అహ్‌జాబ్ : 33-35)*

- భార్యాభర్తల హక్కులను నిర్దేశిస్తూ, ఒకరికొకరు ఉపకారిగా ఉండాలని హితవు చేసింది. మహనీయ(స) స్త్రీలతో మంచిగా ప్రవర్తించాలని తాకీదు చేశారు. ఎవరికయినా ఇద్దరు భార్యలు ఉన్నట్లయితే వారి మధ్య న్యాయంగా వ్యవహరించాలని ఆజ్ఞాపించారు. ఉత్తమ సమాజం కోసం ఆయన పిలుపునిచ్చారు.
- మొత్తానికి ఒక సంస్కారవంతమయిన నాగరికత కోసం చింతనా, నైతికత, చట్టాల అవసరాలు ఏవయితే ఉన్నాయో వాటన్నింటినీ పూరించడం జరిగింది.

  మహనీయ సల్లం స్త్రీలు, బానిసలు, అనాథల హక్కుల గురించి ప్రత్యేకించి చెప్పారు. ఎందుకంటే వారిని బలహీనులుగా లెక్కించడం జరిగింది కాబట్టి. అందువల్లనే ఆయన తన చిట్టచివరి ప్రసంగంలో మానవ హక్కుల (Charter of Human Rights) నియమావళిని ప్రకటించారు. *(అన్నిసా :32, బుఖారి, ముస్లిం, తిర్మిజి, అబూదావూద్, మిష్కాత్, జాదుల్మఆద్, బలుగుల్మరామ్, అన్నూర్ : 19-31, అల్ అహ్జాబ్ : 53-59).*
- ఇస్లామీయ సమాజం, నాగరికతలో స్త్రీ స్థానాన్ని దృష్టిలో పెట్టుకుని సమ్మతమైన హక్కుల నుండి ఆమెను దూరం చేయలేదు.

## 4. ఇస్లాం ఆర్థిక సమతుల్యమయిన నియమాలను ప్రకటించింది

సోషలిజం వ్యవస్థలో ఉత్పత్తిపై ప్రభుత్వం Means of Production (ఒక వర్గం) ఆధిపత్యం ఉంటుంది. వ్యక్తిగత ఆస్తిని అది నిషేధించి సంపదను సామూహిక సంపదగా గుర్తించి పంపకం జరుపుతుంది. దానికి ప్రతికూలంగా పెట్టుబడిదారీ వ్యవస్థ సంపదను ఆర్జించే సాధనాలన్నింటిని వినియోగించుకుని దానిపై పెట్టుబడి దారులు అధికారం చెలాయిస్తారు. సంపద మొత్తంవారి

మధ్యనే తిరుగాడుతూ ఉంటుంది. ఆ వ్యవస్థ నడపడంలో వడ్డీ ప్రధాన పాత్ర వహిస్తుంది. మోసం, వంచన వంటివి అన్నీ నడుస్తూ ఉంటాయి. పేదలు పేదలుగానే ఉండిపోతారు. ఫలితంగా సమాజంలో ధనవంతులుగాను, పేదవారుగాను విభజింపబడతారు. ధనవంతులలో బలవంతం, పిసినారితనం, అపేక్ష వంటివి వేళ్ళూనుకుంటే, పేదవారిలో వారిపట్ల కపటం, ద్వేషం విరోధం వంటివి జనిస్తాయి. ఆ విధంగా ఇరువురిలో వివాదం నడుస్తూ ఉంటుంది. ఇస్లాం ఈ రెండింటి మధ్య కొన్ని హద్దులు నెలకొలిపి ఒక న్యాయవంతమయిన జీవిత విధానాన్ని ప్రవేశపెట్టి నెలకొలిపింది. అందులో విశ్వాస నమ్మకాలు, నైతిక విలువలు ఉన్నత శిఖరాలకు చేరాయి.

- ఇస్లాం ప్రకారం అల్లాహ్‌యే సర్వ సృష్టికర్త, యజమాని, ఉపాధి ప్రధాత. ఈ సిద్ధాంతం ప్రకారం ప్రతి వ్యక్తి మొత్తం దైవిక వనరుల (భూమిలోని సంపద, అడవిలో కలప ఇతర సామాగ్రి ద్వారా, నదులు, సముద్రాల ద్వారా) నుండి అవసరమయిన ఉపాధిని పొందగలు గుతాడు. ఇది మానవాళిపై అల్లాహ్ చేసిన ఉపకారం. ఒక వేళ ఎవరయినా వ్యాపార నిమిత్తం అటవిక సంపదతో లాభం పొందగోరితే ప్రభుత్వం వారిపై పన్ను విధిస్తుంది. (అర్రాద్ : 1-3, అల్‌బఖర : 29, ఇబ్రాహీం : 32 -34, ఆరాఫ్ : 10, 128)

- ధర్మసమ్మతంగా సంపాదించిన సంపదను, వారసత్వపు ఆస్తిని, బహుమతిని ఇస్లాం వ్యక్తుల ఆస్తిగా పరిగణిస్తుంది. సంపాదించిన ఆస్తిని, సంపాదించ కుండా (unearned income) వచ్చిన సంపదలో ఏలాంటి భేదం చూపదు. (అన్‌నిసా:7,29, అల్‌మాయిద:38, అత్‌తౌబ:103, అజ్ జారియత్ : 19)

  ప్రతి వ్యక్తి తన సంపదను కూడబెట్టుకోవచ్చు. వ్యాపారంలో పెట్టుబడి పెట్టుకోవచ్చు. ధర్మసమ్మతమయిన కార్యక్రమాలలో ఖర్చు కూడా పెట్టవచ్చు. ఆ తరువాత కూడా అతని సంపద ఇంకా మిగిలి ఉంటే దానిని ఇస్లామీయ చట్టం సంతానంలో బంధువులలో పంచుతుంది.

ఈ విషయం దివ్యఖుర్‌ఆన్‌లోని సూరె నిసాలో వివరంగా ఆదేశించ బడింది. దైవ ప్రవక్త ముహమ్మద్ సల్లం ఇలా ఆదేశించారు : మరణించే వ్యక్తి తన ఆస్తిని మంచి అభిప్రాయంతో ఒక వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని, ఒక సంస్థకుగాని, మూడో వంతు వరకు వీలునామ వ్రాయవచ్చు. (అన్‌నిసా : 7,13, 176, అల్‌బఖర : 240)

- ఇస్లాం ఉపాధి సంపాదనలో ధర్మసమ్మతం అధర్మ సమ్మతాలను విభజిస్తుంది. దానిపట్ల అతి సున్నితంగా వ్యవహరిస్తుంది. ఇస్లాంలో ఉపాధి సంపాదనలో అధర్మసమ్మతమయివి ఇవి:
- వడ్డీ *(అల్ బఖర : 275, 276, 280)*
- జూదం, సట్ట, లాటరీలతో పాటు మోసం, వంచనతో చేసే వ్యాపారాలు *(అల్ మాయిద:90)*
- అధర్మసమ్మతమైన పద్ధతుల ద్వారా అంటే, లంచం, అపహరణ అవినీతి మొదలయిన వాటి ద్వారా (అన్‌నిసా : 29, అల్ బఖర : 188, 283)
- సారాయి, ఇతర అన్ని మత్తు పదార్థాల వ్యాపారం(అల్ మాయిద : 90)
- సంగీతం వాయించడం, తయారు చేయడం, నృత్యగానాలు చేయడం, అమ్మడం (లుఖ్మాన్ : 6)
- విగ్రహాలు తయారుచేయడం, వాటిని ఆరాధించడం, చిత్ర లేఖనం పేరుతో అశ్లీల చిత్రాలు గీయడం *(అల్ హజ్:30, అల్ అంబియా :51-50)*
- పాచికలతో జోస్యం, పంచాంగం చూడటం, మంత్ర విద్యా వృత్తి *(అల్ మాయిద: 90, యాసీన్: 19, అల్‌బఖర:102, యూనుస్ : 77)*
- అనాథల సొమ్ము ఆస్తులను అనవసరంగా ఖర్చుపెట్టడం *(అన్‌నిసా : బనీఇస్రాయీల్)*
- సిగ్గుమాలిన ప్రచారం, వ్యభిచార వృత్తి *(అల్‌ఆరాఫ్ : 26-28;అన్‌నూర్ : 10, 33, అస్రా:23)*

- తూనికలు కొలతలలో తగ్గింపు, కల్తీ
*(అల్‌ముతఫ్ఫిఫ్ఫీన్ :1, అర్ రహ్మాన్ : 9, ఆరాఫ్ : 85)*
- దోపిడి, దొంగతనం, నిలువుదోపిడి
*(అల్ మాయిద:33,38, అల్ ఆరాఫ్ : 86)*
- సరుకులు నిలువ ఉంచడం, నిత్యావసర వస్తువులను ధరలు పెరగడానికి ఆపి ఉంచడం. (తిర్మిజి, ముస్లిం)
నియమం ప్రకారం ఏ వాస్తవలనయితే దివ్యఖుర్‌ఆన్, హదీసులు నిషేధించాయో వాటిని ఉత్పత్తి చేయడం, వాటి వ్యాపారం చేయడం, వాటి ద్వారా ఏ విధమయిన లాభం పొందడమయినా ఇస్లామీయ ధర్మశాస్త్రం నిషేధించింది.

- హజ్రత్ ముహమ్మద్ (స) కష్టపడకుండా సంపాదించే నిషేధిత పద్ధతులను చాలా తక్కువ సమయంలో అంతం చేసి పరిశుద్ధమైన ఆర్థిక వ్యవస్థను నడిపించారు. ఆయన (స) క్రమంగా విద్య, శిక్షణలు గరుపుతూ చట్టాలు అమలుచేస్తూ సంస్కరించారు. (ఉదాహరణకు సారాయి నిషేధపు ఆజ్ఞ ఆయన(స) అన్నారు: అధర్మసమ్మతమయిన సంపాదనతో పోషింపబడిన శరీరానికి మేలయినది నరకాగ్నియే. *(మఅజుమ్ అల్ సగీర్, తిబ్రానీ)*

- వృత్తిపరమయిన ఉపాధి కోసం అధర్మసమ్మతమయిన పద్ధతులు తప్ప అన్నీ ధర్మసమ్మతమే. ఉదాహరణకు కూలిపని చేయడం. (అల్ ఖసస్ : 26) కూలివాళ్ళ హక్కుల విషయంలో కూలివారి చెమట ఆరకముందే వారి కూలి చెల్లించాలి. (అన్ ఇబ్నెఉమర్ ఇబ్నెమాజా) మహనీయ (స) చిన్నప్పుడు మక్కావాసుల మేకలను కూలిపై మేపేవారు. ఆ తరువాత ఆయన అంతర్జాతీయంగా వ్యాపారం చేశారు. ఆయన వ్యాపారాన్ని, స్వతంత్ర వృత్తిని ఇష్టపడేవారు. నిజాయితీపరుడు, అమానతుదారుడయిన వ్యాపారి పరలోకంలో ప్రవక్తలు, సత్యవంతులు, అమరగతి పొందిన వారితో ఉంటాడు అని అన్నారు. (తిర్మిజి) 'నమాజు చేసి తరువాత అల్లాహ్ అనుగ్రహాన్ని (ఉపాధిని) అన్వేషించండి.' అని దివ్యఖుర్‌ఆన్‌లో

ఉంది. (అల్ జుముఅ: 10) ఆయన అన్నారు: విధిగా నిర్ణయించిన ఆరాధనల తరువాత ధర్మసమ్మతమయిన ఉపాధి కోసం ప్రయత్నించడం కూడా ఆరాధనే. (బైహఖీ) ధర్మసమ్మతంగా సంపాదించాలని ప్రజలను ప్రోత్సహించారు. ఒకాయన మహనీయసల్లంతో ఓ దైవప్రవక్తా ! అన్నింటికంటే మేలయిన సంపద ఏది? అని అడిగాడు. దానికి తన చేతితో సంపాదించింది, అవినీతి లేకుండా చేసే వ్యాపారం అని మహనీయ (స) అన్నారు. *(మిష్కాత్).*

- అనవసరంగా భిక్షం అడగడం ఎంతో కళంకమైన విషయమని అన్నారు. (బుఖారి) ఎందుకంటే దానివల్ల సోమరితనం, పేదరికం, దారిద్ర్యం చుట్టుకుంటుంది. అది ఒక సంస్కృతికి చెదలులా పట్టి నాశనం చేసి వేస్తుంది. ఆయన (స) వద్దకు ఒక వ్యక్తి భిక్షం అడగడానికి వచ్చాడు. "నీ వద్ద ఏముంది అని అడిగారాయన. "నా వద్ద ఒక పాత్ర ఉంది" అన్నాడా భిక్షగాడు. ఆయన (స) దానిని రెండు దిర్హంలకు వేలం చేయించారు. ఒక దిర్హం భార్యాపిల్లల ఆహారం కోసం ఇచ్చి మరొక దిర్హంతో ఒక గొడ్డలి కొనిచ్చారు. ఇదిగో అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి నగరంలో అమ్ము అన్నారు. అతడు అలాగే చేశాడు. కొద్ది రోజుల్లోనే అతని పేదరికం దూరమయి పోయింది. ఒక వ్యక్తి చేతులు పని చేయడం వల్ల కాయలు కాసాయి. కారుణ్యమూర్తి(స) అతని చేతులను ముద్దాడుతూ అన్నారు: ఏ చేతులతో ధర్మసమ్మతమైన ఉపాధి సంపాదించబడుతుందో ఆ చేతులు నరకంలో పోజాలవు అని. (అసద్ అల్‌గాబహ్)

- ధర్మసమ్మతంగా సముపార్జించిన ధనం కూడబెట్టరాదని, దానిపై ఎవరి ఆధిపత్యం ఉండరాదని, అది సమాజంలో పరిభ్రమిస్తూ ఉండాలని అంటోంది ఇస్లాం. అంటే పరిశ్రమలో, వ్యాపారంలో, వ్యవసాయంలో ఇంకా తదితర సమ్మతమయిన పనులలో దానిని వినియోగించాలి. దాని ద్వారా అన్నింటికీ క్రమక్రమంగా లాభం కలగాలి. *(అల్ హదీద్ :7)*

- ప్రజలు పిసినారితనం, ధనాపేక్ష కలిగి అందులోనే లీనం కాకూడదని, తమ కష్టార్జితం సొమ్మును వృధాగా ఖర్చుచేయరాదని, పేరు ప్రఖ్యాతలు, స్త్రీలోలత్వం, తదితర వినోద కార్యాలలో డబ్బు వృధా చేయరాదని, మధ్యే మార్గాన్ని అవలంబించాలని ఇస్లాం అభిలషిస్తోంది. *(ఆలి ఇమ్రాన్ : 180, అత్ తగాబున్ : 34 అల్‌హుమజ; అత్ తకాసుర్; అల్‌సబా : 34-35, అల్ ఖసస్ : 58, అల్ అన్‌ఆమ్ : 141, బనీఇస్రాయీల్ : 27, అల్ ఆరాఫ్ : 31, అల్‌ఫుర్ఖాన్ : 67)*

- **ఇస్లాంలోని మరికొన్ని బోధనలు:** ధర్మసమ్మతమయిన లాభార్జనతో అవసరాలు పూర్తి అయిన తరువాత మిగిలిన దానిని సమాజంలోని బీదసాదలలో పంచివేయాలి. దానికోసం, ఇస్లాం నగదు, బంగారం, వెండిలపై జకాత్, భూమి, వ్యవసాయంపై ఉష్ర్ తీయడం, పశువులపై, ఖనిజాలపై కూడా ఒక భాగం తీయడం (విధి) తప్పనిసరిగా చేసింది. ఇవేకాక అల్లాహ్ మార్గంలో పుణ్యకార్యాలపై సద్ఖా, దానధర్మాలు చేయాలని ప్రోత్సహించడం జరిగింది. ఆ విధంగా బలహీన వర్గాలకు ఇతర సామాజిక కార్యక్రమాలకు సహాయం లభిస్తుంది. వాస్తవంగా చూసినట్లయితే దానం వల్ల సామూహికంగా సహాయం లభిస్తుంది. (ఈ విషయం జకాత్ అంశంలో చర్చించబడింది.) (అల్ బఖర :177, 195, 219, ఆలిఇమ్రాన్ :93, అల్ ముఆరిజ్ :24-25)

- ఎవరు ఏ స్థాయిలో ఉన్నారో ఆ స్థాయిలోనే ఉపాధి ప్రారంభించాలి. ధర్మ సమ్మతంగా ఎంత సంపాదించగలిగితే అంత సంపాదించాలి. నియమానుసారం జకాత్‌ను చెల్లించాలి.

- ఇస్లామీయ వ్యవస్థలో జీవనభృతిని, సమాజంలో స్వాభావికంగా ఆర్థిక సమానతను కొనసాగిస్తూ, నైతిక విలువలను కూడా ఉన్నత శిఖరాలకు చేర్చుతుంది. ప్రజలలో ధనాపేక్ష, పిసినారితనానికి ప్రతికూలంగా స్వాభా

తృత్వం, సానుభూతి, దాతృత్వం, అల్లాహ్ మార్గంలో ఖర్చుచేసే వంటి గుణాలను పెంపొందిస్తుంది. పేదవారిలో సంతుష్టిని కలిగిస్తుంది. అయితే ఇతర ఆర్థిక వ్యవస్థలో నైతిక విలువలకు ఎలాంటి ప్రాధాన్యతా లేదు.

## 5. రాజకీయం

హజ్రత్ ముహమ్మద్ (స), ఆధ్యాత్మికం– ప్రపంచం అనే రెండు భావాలను ఒకే పరిపూర్ణమయిన జీవన విధానంగా ప్రవేశపెట్టారు. ఇందులో రాజకీయం కూడా ఆరాధనే అయ్యింది. ఇస్లాంలో ప్రాపంచిక జీవితం అంటే అల్లాహ్ ఆజ్ఞ, ప్రవక్త సంప్రదాయాల ప్రకారం జీవించినట్లయితే అది పరిపూర్ణమైన ఆధ్యాత్మిక జీవితం అవుతుంది.

- ఖుర్‌ఆన్ ప్రకారం– 'ఇన్నల్ హుక్ములిల్లాహి' (ప్రభుత్వం అల్లాహ్‌ది) ఇంకా 'అలాలహుల్ ఖుల్ఖువల్‌అమ్ర్' (సృష్టితాలపై ఆయన ఆజ్ఞయే నడుస్తుంది) రాజకీయ వ్యవస్థ చట్టం విశేషాధికారం Soverignty కేవలం అల్లాహ్‌దే. ఒక రాజుకుగాని, ఒక వంశానికిగాని, ఒక తెగకుగాని, ప్రజలకుగాని, అధికారం లేదు.

  మానవుడు అల్లాహ్ ప్రతినిధి. అల్లాహ్ ఆజ్ఞలను మాత్రమే జారీచేయడం అతని పని. అంతేగాని, అతడు స్వతహాగా అధికారం లేనివాడు.

  (ఆరాఫ్ :54, యూసుఫ్ :40, సాద్ : 26)

- రాజకీయ వ్యవస్థలో అల్లాహ్‌కు, ఆయన ప్రవక్త చట్టాలకు మాత్రమే ఆధిక్యం ఉంది. వాటిని ఎవరూ ప్రశ్నించలేరు. దేశ పరిపాలకుడు (అమీర్, లేదా అధ్యక్షుడు) దేవుని అవిధేయతగల ఆజ్ఞ ఇవ్వనంత వరకు ప్రతి పౌరుడు అతని ఆజ్ఞకు బద్ధుడై ఉండాలి. (అల్ ఆరాఫ్ : 54, అన్‌నిసా : 59)

- ఇస్లామీయ రాజకీయ వ్యవస్థకు 'మూలం' 'సలహా మండలి' (ఆలిఇమ్రాన్: 159) ఏ వ్యవహారంలోనైనా అల్లాహ్ తరఫునుండి ఏదైనా ఆజ్ఞ

లభించనట్లయితే ఆయన (స) తన సహచరులతో సలహా తీసుకునేవారు. ఉదాహరణకు బదర్ యుద్ధం, ఉహద్ యుద్ధం, అహ్జాబ్ యుద్ధం, హుదైబియా ఒప్పందాల సందర్భాలలో ఆయన(స) తన సహచరుల నుండి సలహా తీసుకున్నారు.

- ఆయన (స) అల్లాహ్ ఆజ్ఞతో సామూహిక తీర్పును ఇస్లామీయ రాజ్యస్థాపనకు మూల ఆశయంగా నిర్దేశించారు. ఆ రాజ్యంలో ప్రత్యక్షంగా కనిపించే ప్రత్యేకతలు: క్రమం తప్పకుండా నమాజు చేయడం, జకాత్ చెల్లించడం, మంచిని స్థాపించడం, చెడును త్రుంచడం. వీటి ఆచరణకు ఫలితం శాంతిశ్రేయాలు వెల్లివిరియడం.

(అల్ హదీద్ : 25, అల్‌హజ్ :41)

హజ్రత్ ముహమ్మద్ (స) కాలంలో ముస్లిమేతర పౌరుల హక్కులు పరిరక్షించబడేవి. వారి ధనం, ప్రాణం గౌరవాలు ఒక ముస్లింకు ధన, మాన, ప్రాణానికి ఉన్న గౌరవాల వలె కాపాడబడేవి. వారి మతంపై వారు నడుచుకోడానికి స్వేచ్ఛ ఉండేది. ధర్మం విషయంలో వారిపై ఎలాంటి బలాత్కారం ఉండేది కాదు. ముస్లింల నుండి జకాత్, సద్ఖా, వసూలు చేసినట్లుగానే ముస్లిమేతరులతో 'జిజియా' (జుట్టు పన్ను అనేది తప్పుడు ప్రచారం) వసూలు చేయబడేది. అందువల్ల వారి బాధ్యత ఇస్లామీయ ప్రభుత్వానిదే. (అల్ బఖర : 256, అత్‌తౌబ : 29)

- హజ్రత్ ముహమ్మద్ (స) అల్లాహ్ అవతరింపజేసిన చట్టాల ప్రకారం ప్రభుత్వం నడిపారు. ఆ చట్టాలలో మార్పులు చేర్పులు చేసే అధికారం ఆయనకు ఉండేదికాదు. (అన్‌నిసా : 105, అల్‌బఖర:178, అల్‌మాయిద : 38, అన్‌నూర్ : 2,3,4; అల్ మాయిద : 33)

- ఇస్లామీయ రాజ్యం ఒక సంక్షేమ రాజ్యం Welfare State ఏ వ్యక్తి కూడా ఆ రాజ్యంలో అవసరాలు తీరకుండా జీవించడు.

ఆయన (స) అన్నారు : 'ఎవరు నిరాశ్రయులో వారికి ఇస్లామీయ రాజ్యం ఆశ్రయం ఇస్తుంది. ఆదం సంతానానికి ఉండడానికి ఇల్లు, ఆచ్ఛాదనకు వస్త్రం, తినడానికి అన్నం, త్రాగడానికి నీరు ఇచ్చే బాధ్యత ఆ రాజ్యానిదే. సృష్టిరాశులన్నీ దేవుని కుటుంబం అన్నారాయన (స) అయితే ఆ కుటుంబ సభ్యులకు ఎవరు మంచివారో వారే అల్లాహ్ వద్ద మంచివారు.' (జామిఅ సగీర్ : ఆధారం తబ్రి, బైహఖి).

## మానవ హక్కులు

మానవహక్కుల గురించి ఈనాడు నలువైపుల నుండి గగ్గోలు పెట్టడం జరుగు తోంది. కాని దానిని పునాది రాయిగా నిలిపి ప్రప్రథమంగా ఆచరణలో పెట్టింది మానవ మహోపకారి ముహమ్మద్ (స)గారే. ప్రతి మనిషికి ప్రాణరక్షణ హక్కు, ఆస్తి హక్కు, మాన మర్యాదల హక్కు, వ్యక్తిగతంగా జీవించే హక్కు, వాక్ స్వాతంత్ర్య హక్కులను సమ్మతించడం జరిగింది. మత స్వేచ్ఛ, సోదర భావాలకు ప్రోత్సాహం ఇవ్వబడింది. *(బనీఇస్రాయీల్ : 33, అన్నిసా:29, అల్ హుజురాత్ :11, 12, అల్అన్ఆమ్ :108, అల్బఖర: 252, అల్కాఫిరూన్, అన్నిసా : 147, ఆలిఇమ్రాన్ :110)*

## ఇస్లామీయ రాజ్య శాసనాలు

అల్లాహ్ వచన ఔన్నత్యం కోసం జిహాద్ అత్యవసర పరిస్థితులను ఎదుర్కోడానికి ఎల్లప్పుడూ యోధులను యుద్ధ సామగ్రిని సిద్ధంగా ఉంచాలి. యుద్ధ నియమాల గురించి ఆయన(స) ముజాహిదీన్లకు ఇలా హితవు చేశారు. ముందు దేవుని ఏకేశ్వరోపాసనా సందేశం వినిపించాలి. లేదా

ఇస్లామీయ రాజ్యానికి విధేయత చూపడానికి సిద్ధంగా ఉన్నారా అని అడగాలి. ఒక వేళ యుద్ధం తప్పనిసరి అయితే కేవలం అల్లాహ్ కోసమే యుద్ధం చేయాలి. యుద్ధంలో స్త్రీలపై, పిల్లలపై, వృద్ధులపై, ఆరాధనాలయాలపై దాడి చేయరాదు. పూజారులనయినా సరే, సన్యాసినయినా సరే చంపరాదు. గౌరవనీయులను అగౌరవపరచరాదు. చెట్లను నరకరాదు. చేలను ధ్వంసం చేయరాదు. మక్కా విజయం నాటి ఆయన (స) గారి ప్రవర్తన, బోధనలు మహోన్నతమైన ఉదాహరణలు.

## అంతర్జాతీయ రాజకీయం

అంతర్జాతీయ రాజకీయంలో న్యాయం, వాగ్దానాలకు ప్రత్యేకతలు ఇవ్వబడ్డాయి. ఇవే దానికి మూలాలు. ఆయన (స) వాటికి కట్టుబడి ఉండేవారు. *(అల్ బఖర : 126, అల్ మాయిద : 8, అత్ తౌబ : 41, అల్ బఖర : 205, అన్‌నహ్ల్ : 34, సీరతున్నబీ, అర్రయిఈఖుల్ మక్తూమ్)*

### ఖజానా

ప్రభుత్వ ఖజానాలో అల్లాహ్ మార్గంలో ఇచ్చిన ధనం, జకాత్, సద్‌ఖాత్, ఉష్ర్ జమచేయ బడుతుంది. దానివల్ల ఒకవైపు ధనవంతుల సంపద ప్రక్షాళనం అవుతుంది, మరోవైపు సమాజంలోని అణగారిన వారికి సహాయం లభిస్తుంది. దానికోసం ఆయన తహసీల్దార్ (కలక్టరేట్) స్థాపించారు. జకాత్ ధనాన్ని ఫకీరులకు, నిరుపేదలకు, జకాత్ వసూలు చేసే వారి వేతనాలకు, ఎదుటివారి హృదయాలను జయించడానికి, బానిసలను స్వతంత్రులుగా చేయడానికి, అప్పు ఉన్నవారు అప్పు తీర్చుకోవడానికి, బాటసారులకు ఆతిథ్యం ఇవ్వడానికి, అల్లాహ్ మార్గంలో వినియోగించడానికి ఖర్చుచేయబడుతుంది. ప్రభుత్వ ఖాజానాలోని సొమ్మును అల్లాహ్ ఆయన సృష్టితాల అమానతుగా భావించబడేది. దౌర్జన్యంతో సంపాదించిన అధర్మసొమ్ము అందులో

వేయడంగాని, గుడ్డిగా ఖర్చుపెట్టడంగాని, జరగదు. *(అల్‌హజ్ : 41, అత్ తౌబ : 60, 103)*

తహసిల్దారుకుగాని, రాష్ట్రాధినేతలకు గాని, ఖజానా నుండి అవసరానికి మించి డబ్బును తీసుకునే అధికారం ఉండేదికాదు. వారి జీతభత్యాలు కూడా ఓ మామూలు వ్యక్తి జీతం కన్నా మించేదికాదు. ఏ విధమైన వడ్డింపులు కూడా ఉండేవికావు. ప్రతివ్యక్తికీ ఖజానా లెక్కలు అడిగి తెలుసుకునే అవకాశం ఉండేది.

## 6. న్యాయస్థానం

ప్రవక్తలకు స్పష్టమయిన దృష్టాంతాలతో, గ్రంథాన్ని సంతులనమయిన న్యాయాన్నిచ్చి ప్రపంచంలో పంపించడానికి కారణం, సమాజంలో న్యాయం స్థాపించడం కోసమే. లయఖ్ వమన్నాస్ బిల్‌ఖిస్త్ (అల్ హదీద్) ఈ విధంగా ఖుర్‌ఆన్ గ్రంథాన్ని మహనీయ ముహమ్మద్ (స) గారికి ఇచ్చి పంపించింది కూడా న్యాయం నాలుగు పాదాలతో నడిపించడానికే అని ఖుర్‌ఆన్ అంటోంది:

"ప్రవక్తా ! అల్లాహ్ నీకు చూపిన రుజుమార్గానికి అనుగుణంగా నీవు ప్రజల మధ్య తీర్పు చేయటానికి మేము ఈ గ్రంథాన్ని సత్యంతో నీ వద్దకు పంపాము." (అన్‌నిసా : 105)

దివ్యఖుర్‌ఆన్‌లో ఉంది, 'ఎవరయితే అల్లాహ్ శాసనం ప్రకారం తీర్పు చేయరో వారు తిరస్కారులు, దౌర్జన్యపరులు, దురాచారులు.' (అల్ మాయిద : 44, 45,47) కపటులకు కూడా ఇలాగే చెప్పబడింది. వారు అల్లాహ్‌కు, ప్రవక్తకు బదులు, తాగూత్ (అసత్య న్యాయస్థానం) ద్వారా తీర్పు కోరుతున్నారు. *(అన్‌నిసా: 60)*

● అల్లాహ్ శాసనం కంటే మించిన శాసనం మరొకటి లేదు. ఎవరికీ ఏ విధమ యిన మినహాయింపులూ ఇందులో లేవు. ఖలీఫా (దైవ ప్రాతినిధ్య పరిపాలకుని) పై అభియోగం మోపవచ్చు. అతనికి వ్యతిరేకంగా తీర్పు కూడా

ఇవ్వవచ్చు. అలా జరిగింది కూడా. దివ్యఖుర్ఆన్‌లోనూ, హదీసులోనూ, పౌరచట్టం (Civil Laws) అంటే నికాహ్, భార్యా భర్తల హక్కులు, తలాఖ్, స్తన్యపానం, ఋతుకాలం, ఆస్తి, ధర్మాదాయం మొదలయినవి. వాటికి ప్రజా శాసనాలను విశదీకరించడం. జరిగింది. అదేవిధంగా నేరశాసనం (Criminal Laws) అంటే, హత్య, దొంగతనం, వ్యభిచారం, అమాయక స్త్రీలపై వ్యబిచార నేరం మోపడం, తిరుగుబాటు, కల్లోలాలు సృష్టించడం, ఇస్లాం ధర్మభ్రష్టత్వం జరిగినందుకు శిక్షలు నిర్ణయించబడ్డాయి. అయితే సారాయి సేవించడం, ఇతర నేరాలను వాటి స్థాయిని అనుసరించి శిక్షించడం జరుగుతుంది. హజ్రత్ ముహమ్మద్ (స) అల్లాహ్ శాసనాలను ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా అమలుపరిచారు. ఒకసారి ఒక గొప్ప తెగకు చెందిన ఫాతిమా అనే స్త్రీ దొంగతనం చేసిన నేరంపై పట్టుబడింది. ఆమెను క్షమించరాదని ధర్మం చెబుతూ ఉంది. ఆయన (స) : "అల్లాహ్ సాక్షిగా! ఒకవేళ ఈమె స్థానంలో నా కూతురు ఫాతిమా గనక ఉండి ఉంటే నేను ఆమె చేతిని కూడా నరికే శిక్షను విధించి ఉండేవాడినే." అని అన్నారు. (సీరతున్నబి)

- ఏదయినా వ్యాజ్యం కోర్టుకు రాకముందే పరస్పరం మధ్యవర్తుల ద్వారా పరిష్కరింప బడితే ఫరవాలేదు. ఒకవేళ న్యాయస్థానంలో కేసువేసినా అందుకు న్యాయంగా తీర్పు చెప్పడం జరుగుతుంది.

- ఇస్లామీయ రాజ్య వ్యవస్థలో పరలోకంలో జవాబుఇచ్చే భావన ప్రజలలో ఎంతగా నాటుకుపోతుందంటే వారి మనస్సాక్షియే వారిని కాపాడుతూ ఉంటుంది. అప్పుడప్పుడు నేరాలు జరిగాయి. అయితే నేరం చేశామని నేరస్తులే చట్టానికి లొంగిపోయేవారు. శిక్షించమని ప్రవక్త (స)ను ప్రాధేయపడేవారు. ఒకసారి ఒక వ్యక్తి వచ్చి: 'ఓ ప్రవక్తా! నేను ఫలానా నేరం చేశాను. నన్ను ప్రక్షాళనం చేయండి' అన్నాడు. ప్రవక్త సల్లం ఆ నేరాన్ని దాటవేయడానికి ప్రయత్నించారు. ఎంత చెప్పినా వినకుండా ఆ వ్యక్తి ప్రక్షాళనం కాదలిచాడు. చివరికి అతనిని శిక్షించడం జరిగింది.

- కొందరు ఇస్లామీయ శాసనాల పట్ల వ్యతిరేకతను కనబరుస్తారు. ఇస్లామీయ చట్టం ఎవరిని కూడా అనవసరంగా శిక్షించదు. అది ముందు ప్రజలను సుశిక్షితులుగా తీర్చిదిద్దుతూ మేలయిన వాతావరణాన్ని సృష్టిస్తుంది. ఆ తరువాత నేరం రుజువయితే శిక్షించడం జరుగుతుంది. ఇస్లామీయ రాజ్యంలో ఆ కొందరిని శిక్షించడం ద్వారా సమాజమంతా శాంతిశ్రేయాలు విలసిల్లుతాయి.
- ఏ దేశాలలోనైతే ఇస్లామీయ చట్టాలు అమలులో ఉన్నాయో వాటిలో నేరాల సంఖ్య చాలా తక్కువ. ఉదాహరణకు: అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, దేశాల నేరాలకంటే (సర్వే ప్రకారం) సౌదిఅరేబియాలో జరుగుతున్న నేరాలతో పోలిస్తే ఈ వాస్తవం తేటతెల్లం అవుతుంది. అయినప్పటికీ అక్కడ కూడా పూర్తి ఇస్లామీయ శాసనాలు అమలులో లేనికారణంగా ఆ మేరకు అక్కడ నేరాల సంఖ్య తక్కువ.
- మానవ నిర్మిత చట్టాలలో లొసుగులు ఉంటాయి. అందువల్లనే మాటి మాటికి అవి సవరణలకూ, మార్పులకు గురవుతుంటాయి. కాని అల్లాహ్ శాసనాలు మాత్రం ఎలాంటి లొసుగులు లేకుండా పవిత్రంగా ఉన్నాయి.

## ఉత్తమ సమాజ స్థాపన

హజ్రత్ ముహమ్మద్ సల్లం అంతర్జాతీయంగా విశ్వాసుల ఒక సంస్థ (జమాత్ హిజ్బ్‌ఉల్లా, ఉమ్మతె ముస్లిమ, ఖైరెఉమ్మత్, లేక ఉమ్మతెవసత్)ను ఏర్పాటు చేశారు. ఇందులో విభిన్న జాతులు, తెగల ప్రజలు ఉండేవారు. వారి వంశం రంగు, భాష, ప్రాంతం వేరువేరుగా ఉండేవి. వారి మధ్య లాఇలాహ ఇల్లల్లాహు (దేవుడు ఒక్కడే ఆయన వినా మరో దైవం లేడు) అన్న విశ్వాసం మాత్రం ఉమ్మడిగా ఉంది. ఆ ఒక్క సిద్ధాంతమే ప్రపంచ మానవులందరినీ సమైక్య పరుస్తుంది. ఇక ఉత్తమ సమాజ గుణగణాలను తెలుసుకుందాం. అవి ఇవి:

## 1. ఉత్తమ ప్రవర్తన

హజ్రత్ ముహమ్మద్ (స) ముస్లిములకు ఇస్లాం బోధనలు, శిక్షణను ఇచ్చారు. వారిలో ధర్మావగాహన కలిగించారు. వారి హృదయాలను ప్రక్షాళనం చేశారు. అందువల్లనే వారు సత్యవంతులు, నిజాయితీపరులయిన ముస్లింలుగా తయారయ్యారు. వారు అల్లాహ్ ప్రవక్త (స) ఒక్కొక్క మాటను ఆచరించి చూపారు. (ఆలిఇమ్రాన్ :164, తౌబ :122, అన్నూర్ : 51)

## 2. ఆశయం గల జీవితం

హజ్రత్ ముహమ్మద్ (స) అన్నారు: 'మానవుని జీవితాశయం కేవలం మంచి ఆహారం భుజించడం, వంశాన్ని పెంచడం, జీవిత ప్రమాణాలను మెరుగుపరచడమే కాదు. అల్లాహ్ అతడిని భూమిపై తన ప్రతినిధిగా (ఖలీఫా) చేసి పంపించాడు. మంచిని ఆజ్ఞాపించడం, చెడునుండి వారించడం అతని విధి. దానికోసం అతడు అల్లాహ్ మార్గంలో పటిష్టవంతంగా కృషి చేస్తూఉంటే, చివరికి అల్లాహ్ ధర్మ సంస్థాపనం జరగాలి. వారి చివరి ఆశయం, అల్లాహ్ ప్రసన్నత ద్వారా పరలోక విజయం ప్రాప్తించడమే కావాలి. (ఆలిఇమ్రాన్ : 110, అన్నిసా :59, అల్‌బఖర : 143, అల్‌హజ్ : 28)

## 3. ధన ప్రాణాల త్యాగం

ప్రపంచంలో ఏ సిద్ధాంతమయినా పరీక్షింపబడకుండా ఆపదలను ఎదుర్కోకుండా, ఆశయం కోసం ధన ప్రాణాలను త్యాగం చేయకుండా విజయవంతం కాలేదనేది వాస్తవం. అదే విధంగా హజ్రత్ ముహమ్మద్(స) నాయకత్వంలో సహబాలు (అనుచరులు) కూడా ఆపదలను, కష్టాలను ఎదుర్కొంటూ ధన, ప్రాణాలను త్యాగం చేయవలసి వచ్చింది. అప్పుడు అల్లాహ్ వారి ఆశయంలో విజయం చేకూర్చాడు.

"వారంటే అల్లాహ్ ఇష్టపడ్డాడు. అల్లాహ్ అంటే వారూ ఇష్టపడ్డారు."
(ఆలిఇమ్రాన్ : 146, అల్‌బఖర : 155, 156, 214, అత్ తౌబ : 24, 100)

# చివరి మాట

హజ్రత్ ముహమ్మద్ (స) 22 ఏప్రిల్ క్రీ.శ. 571లో జన్మించారు. క్రీ. శ. 632లో పరమపదించారు.

హజ్రత్ ముహమ్మద్ (స) అంతిమ ప్రవక్త, ప్రపంచవాసులందరికి కారుణ్యం. ఉన్నత నైతికతకు ప్రతీక. విశ్వాసులకోసం ఆయన (స) జీవితం ఉత్తమమయిన ఆదర్శం.

## 1. ఖుర్ఆన్

ఇది అల్లాహ్ గ్రంథం. ఇందులో మానవులందరికోసం చక్కని మార్గమూ, జీవిత నియమావళి ఉంది.

## 2. హదీసు-సున్నత్

హదీస్ అంటే మహనీయ (స) ప్రవచనం. సున్నత్ అంటే ఆయన సంప్రదాయం.

దివ్యఖుర్ఆన్, హదీసులే ఇస్లాంకు మూలస్థంబాలు

## 3. సహాబాల సంఘం

సత్యవంతులు, నిజాయితీగలవారు ఒక పటిష్టవంతమయిన విప్లవ సంఘం (జమాత్) అది. అల్లాహ్‌కు, ప్రవక్త (స)కు విధేయత గల సంఘం. అది ఇస్లాం ప్రబలడానికి ధనప్రాణాలు త్యాగం చేసిన సంఘం.

## 4. ఇస్లామీయ రాజ్యం

ఆయన(స) తన బోధనల ప్రకారం ఒక సంపూర్ణమయిన రాజ్యాన్ని స్థాపించి దానిని అల్లాహ్ శాసనం ప్రకారం నడిపించారు.

- ఎవరయినా దివ్యఖుర్ఆన్, హజ్రత్ ముహమ్మద్(స) జీవిత చరిత్రను సదభిప్రాయంతో చదివినట్లయితే, ప్రపంచ చరిత్రలోనే మరొకరు ఆయన(స)తో రవ్వంత కూడా పోలిక కలిగిలేడని సమ్మతించక మానడు.

ఆయన (స) నిజానికి ఒక చరిత్రను సృష్టించారు. ఒక కొత్త యుగాన్ని ప్రారంభించారు.

- హజ్రత్ ముహమ్మద్ (స) ఇస్లాం సందేశ ప్రచార ఉద్యమాన్ని ఎలాంటి సరంజామా లేకుండానే ప్రారంభించారు. ఆ తరువాత పరిమిత వనరులతో ఇస్లాం పేరుతో ఒక కొత్త సంస్కృతిని, నాగరికతను, ప్రపంచానికి పరిచయం చేశారు. ఇది అల్లాహ్ సహాయం, ప్రవక్త వివేకం, ఆయన అనుచరుల ప్రబల ప్రయత్న ఫలితమే.
- హజ్రత్ ముహమ్మద్ (స) వ్యక్తిత్వం పవిత్రతో ఉత్తమ గుణగణాలతో కళకళ లాడుతోంది. అది అందరికోసం ఒక పరిపూర్ణమయిన ఆదర్శం. ఒక గురువు, ఒక శిక్షకుడు, ఒక నైతికవిలువల ప్రబోధకుడు, ఒక న్యాయాధికారి, ఒక మార్గదర్శకుడు, ఒక నాయకుడు, ఒక వివేకవంతుడు, ఒక రాజకీయవేత్త, ఒక ఆర్థికవేత్త, ఒక విజేయుడయిన సైన్యాధికారి, ఒక రాజ్యాధినేత, ఒక న్యాయధికారి, మొదలయిన వారికి ఆయన (స) ఆదర్శప్రాయులు.
- హజ్రత్ ముహమ్మద్ (స) కంటే ముందు అరబ్బులు అజ్ఞానులు. కయ్యానికి కాలుదువ్వే కలహకారులు. వారి తెగలలో, బంధుత్వాలలో వైరుధ్యం ఉండేది. వారు ఏ చట్టానికీ కట్టుబడి ఉండేవారు కాదు. అన్ని రకాల చెడులు, వారిలో ఉండేవి. అలాంటి పతనమైన సమాజాన్ని హజ్రత్ ముహమ్మద్ (స) 23 సంవత్సరాల కాలంలో వారి ఆలోచనా సరళిని మార్చివేసి 12 లక్షల చదరపు మైళ్ళ విస్తీర్ణంలో ఒకే శాసనానికి కట్టుబడి ఉండేలా చేసి ఒకే దేశంగా తీర్చిదిద్దారు. ఇది సంపూర్ణమైన సార్వజనీన మయిన విప్లవం. ఈ విప్లవం వ్యక్తులను ప్రక్షాళనం చేయడమే గాక, మొత్తం జాతినే మార్చివేసింది. వారిని ప్రపంచ నాయకులుగా చేసింది.
- హజ్రత్ ముహమ్మద్ (స) విస్తరింపజేసిన విప్లవం ఫలితంగా ప్రజల ఆలోచనలలో మార్పు వచ్చింది. ప్రజలు దైవతిరస్కారాన్ని, బహుదైవా రాధనను వదలి దేవుని ఏకత్వానికి కట్టుబడి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో జీవించేవారు. అల్లాహ్‌కు ఆయన ప్రపక్త (స)కు విధేయులయ్యారు.

దైవ సమక్షంలో నిలుచుండి సమాధానం ఇవ్వవలసి ఉందన్న భావన వారిని ఉత్తములుగా, మంచి ప్రవర్తనగలవారుగా తీర్చిదిద్దింది.

- దుర్మార్గులయిన సంచారులు నైతిక విలువలకు నిదర్శనంగా నిలిచారు. అజ్ఞాను లయిన వారు విద్యాజ్ఞానాల సంపన్నులయ్యారు. ఏ సమాజంలో నైతే హక్కులు కొల్ల గొట్టబడేవో, దౌర్జన్యం జరిగేవో ఆ సమాజం ఉత్తమ సమాజంగా వెలుగొందింది. ఏ సమాజంలో దోపిడీ దొంగతనాలు, మోసం, వడ్డీ వ్యాపారం ఉండేదో కష్టపడే వారిపై దౌర్జన్యాలు జరిగేవో, వారంతా అధర్మ సంపాదనకు దూరమయ్యారు. ఎవరి రాజకీయమయితే అపనమ్మకంతో, దౌర్జన్యంతో నిండిపోయిందో వారు న్యాయ కోవిదులుగా, మానవ హక్కులను నిర్వర్తించేవారుగా, శాంతికాముకులుగా విలసిల్లారు. ఎవరిలో వంశపారంపర్యంగా యుద్ధాలు కొనసాగాయో, వినాశనం, దోచుకోవడం జరిగేదో వారికి యుద్ధనీతి, ఒడంబడికలు, నేర్పించ బడ్డాయి. చెల్లాచెదురుగా ఉన్న ప్రజలను ఏకం చేయడం జరిగింది. చట్టరహిత సమాజాన్ని చట్టానికి కట్టుబడేవిధంగా మలచబడింది. బలహీనవర్గాలను ఉన్నత శిఖరాలకు చేర్చి మానవ సమానత్వాన్ని చాటి చెప్పడం జరిగింది. ప్రపంచమంతటిలో ప్రప్రథమంగా మానవ హక్కుల చార్టర్‌ను ప్రకటించి పటిష్టవంతంగా ఆచరించడం జరిగింది.

## హజ్రత్ ముహమ్మద్‌సల్లం సందేశం సంక్షిప్తంగా ఇది:

**ఒకే దైవం, ఒకే మానవాళి, ఒకే వ్యవస్థ. అందువల్ల దీని నియమాలన్నీ నిష్పక్షపాతంగా నిత్యనూతంగా నిరంతరంగా కొనసాగేందుకు అర్హమైనవి.**

**హ|జత్ ముహమ్మద్ (స) దైవ సందేశాన్ని ప్రజలందరికీ చేరవేశారు. తనకు అప్పగించిన అమానతు హక్కును నెరవేర్చారు. తన సమాజంలో ఏ వెలితీ ఉంచలేదు.**

అంతిమ దైవప్రవక్త సల్లం అన్ని రకాల కష్టాలను సహించారు. ఆకలి దప్పులకు గురయ్యారు. ఏలాంటి సిరిసంపదలు వదలి వెళ్ళలేదు. ప్రపంచంపై పరలోకానికి ప్రాధాన్యతనిచ్చారు. చివరికి హాజరయ్యాను ప్రభో అంటూ నాశనమయ్యే ఈ ప్రపంచాన్ని వీడి శాశ్వతమైన పరలోకానికి వెళ్ళిపోయారు. ఆ మానవ మహోపకారిపై సహస్రాది కోట్ల సలాములు. ఇదే హజ్రత్ ముహమ్మద్ సల్లం సందేశం, జీవితం. ఆయన (స) మహోన్నత కార్యాలను గురించిన సంక్షిప్త పరిచయం. దీనిని నేను దివ్యఖుర్‌ఆన్, ప్రవక్త (స) జీవిత చరిత్ర, హదీసుల నుండి గ్రహించి సంకలనం చేశాను. ఎవరు హజ్రత్ ముహమ్మద్ (స)ను తమ మార్గదర్శిగా ప్రబోధకులుగా విశ్వసించారో, ఆయనను అనుసరించారో వారికి శుభాభివందనాలు. ఇహపర లోకాలలో వారు సఫలులయ్యారు. *(మాయిద, అర్‌రాద్ : **15**)*

అల్లాహ్ మనందరిని ఇస్లాంపై నడిచే భాగ్యాన్ని ప్రసాదించుగాక. *(ఆమీన్)*

సుబ్‌హాన రబ్బిక రబ్బిల్ ఇజ్జతి అమ్మా యసిఫూన్ వసలామున్ అలల్ మర్‌సలీన్ వల్ హమ్దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్

సల్లల్లాహు అలైహివసల్లం

